[ర]ోహిణి

నాటికలు

# కొయ్యగుర్రం

చిన్నారి లోకం . . . బాల సాహిత్యం

# కొయ్యగుర్రం

[ నాటికల సంపుటి ]

రచన:
పి. సీతారాజ్యలక్ష్మి

విశాలాంధ్ర ప్రచురణాలయం
విజయవాడ.

ఇందులోని నాటికలన్నీ

తెలుగుభాషాసమితి, మద్రాసు

వారిచే బహుమతి

పొందినవి.



# హెచ్చరిక

---

ఈ పుస్తకంలోని నాటికల కాపీరైటు హక్కులన్నీ యిదివరకే సంక్రమింపబడ్డాయి. చదువరులు సదరు హక్కులకు భంగంలేనివిధంగా ప్రవర్తించాలని హెచ్చరిక. ఈ నాటికలను అనుమతిలేనిదే ఏవిధంగానూ వుపయోగించరాదు.

—రోహిణి.

# అంకితం

డాక్టర్ శ్రీ గిడుగు వెంకట
సీతాపతిరావు గారికి

ఈ నాటికలలోని పాత్రలూ, సంఘటనలూ, వివిధ సంఘాలు కేవలం కల్పితాలు. ఎవరికిగాని అవి అన్వయిస్తే అది కేవలం కాకతాళీయమే అవుతుంది. అంత కన్న మరేంకాదు.

—రో హి ణి

ఈనాటికల్లో "నీతి ఏమిటి"ని ! నన్నడక్కండి ! ఆమాటకొస్తే భగవత్స్వరూపులైన పిల్లలకి మనం నేర్పే నీతి ఏం వుంది ?

అమాయిక హృదయానురాగాలు కల్లాకపటం ఎరుగని బోసినవ్వులూ మనకే ఎన్నో నీతులు నేర్పుతాయి. ఈ నాటికలు కేవలం పిల్లలకి సర్దాగా కాలక్షేపం కావటానికి వ్రాశాను. వీట్లల్లో ఏమంత చెప్పుకోదగ్గ శిల్పమూ లేకపోవచ్చు, సాహిత్యంలోనూ చాలా లోపాలుండవచ్చు.

ఈ నాటికలు ప్రదర్శనకు చాలా తేలిక. కొద్ది శ్రమతో చక్కగా రక్తి కట్టించవచ్చు. ఇవి పిల్లలకు అభినయాసక్తిని అభివృద్ధిచేయటానికి బాగానే తోడ్పడతాయని నా నమ్మకం.

ఈ నాటికల్ని ప్రదర్శనకుగాని మరేవిధంగాగాని వుపయోగించుకోదల్చుకున్నప్పుడు ముందుగా నా లిఖిత పూర్వక అనుమతిని పొందాలి.

—రోహిణి

# కొయ్యగుర్రం

[పిల్లల ఏకాంక నాటిక]

ఈ నాటిక ఆలిండియా రేడియో విజయవాడ కేంద్రంనుంచి ది 15-1-1956 తేదీ ఆదివారం నాడు బొమ్మరిల్లు కార్యక్రమంలో గం. 4 నుండి 4-10 గం. వరకు ప్రసారిత మైనది.

# కొయ్యగుర్రం

—ఏ కాం కి క—

(ఒకేదృశ్యం)

## పాత్రలు

1. విశ్వరూపాచారి :

30 మొదలు 45 ఏళ్ళవరకూ వయస్సు. శిల్పవృత్తి అంటే వడ్రంగం వగైరా పాతపద్ధతులవల్ల పొట్టజరగక కొత్త పద్ధతులమీద యీర్షాజనితుడై వున్నాడు.

2. నౌఖరు :

45 మొదలు 50 ఏళ్ళవరకూ వయస్సు. మోహన్‌బాబుగారింట్లో నౌఖరు.

3. మణిభూషణాచారి ;

విశ్వరూపాచారి కుమారుడు. 3 మొదలు 5 వరకు వయస్సు.

4. మోహన్ బాబు :

విశ్వరూపాచారి ప్రక్కయింటి భాగ్యవంతుల బిడ్డ. మణిభూషణునకన్న ఓఏడాది చిన్నవాడు.

5. కొయ్యగుర్రం :

ముందరికాళ్ళు విరిగిపోయి ప్రవేశిస్తుంది. మొత్తమంతా విరిగి ముక్కలైపోతుంది. అయితేనేం యిది చెప్పే ధర్మపన్నాలు వినితీరాలి !

# కొయ్యగుర్రం

## ఏకాంకిక

### ఒకే దృశ్యం

(విశ్వరూపాచారి యిల్లు)

విశ్వరూపాచారి చక్కని శిల్పి. పిల్లలాడుకునే బొమ్మలు చాలాచాలా రకాలు తయారుచేశాడు. కానీ ఈమధ్య అతని బొమ్మలకు అట్టే గిరాకీలేదు. అమ్మకం పడిపోయింది. అతని బొమ్మలన్నీ చాలా పాతపద్ధతులతో తయారై తలకు మించిన ఖరీదుగలవి. చాలా చౌకధరలకు వింతవింత విదేశీ బొమ్మలు బజార్లో అమ్ముతున్నారు.

ఇతని కొడుకు మణిభూషణాచారి ఐదేళ్ళవాడు.

ఇంటిపక్క భాగ్యవంతుల పిల్లాడు మోహన్‌బాబు కొనుక్కున్న "కొయ్యగుర్రం" తనకూ్కడా కొనిపెట్టమని తండ్రివద్ద మారాం చేస్తున్నాడు.

మణి :

నాన్నా నాన్నా మలేం వాల్ల మోహనబాబేం గుల్లాన్ని కొనుక్కున్నాలు నాన్నా.

విశ్వ :

(వినిపించుకోడు)

మణి :

(గారాబంగా) నాకూ్కడా ఓ గుల్లాన్ని కొనిపెత్తవే- ఊం- ఊం-

విశ్వ :

ఛీ- పాడుగుర్రం. (అనునయిస్తూ) ఇదిగో మనింట్లో చూడు ఎంత మంచిబొమ్మలున్నాయో. ఇవన్నీ నేను చేసినవి (గర్విస్తాడు).

మణి :

(వాటివంకైనా చూడకుండా) ఇవన్నీ పిచ్చిబొమ్మలు. ఊగవు. వాల్లగుల్లం తలాడిత్తోంది. పగెత్తుతుందిట కూడాను. లిచ్చాలోంచి దింపుతుంటే చూచా. మోహన్ బాబుకి వాల్లనాన్న మంచిమంచి బొమ్మలు కొంతాలు. నాకు నువ్వేంకొనవు.

విశ్వ :

వాళ్ళకి చాలా డబ్బుంది మనకులేదు. అయినా మనం బొమ్మలు కొనుక్కోవాల్సిన కర్మయేం పట్టింది. నేను చెయ్యటంలేదూ యిన్ని బొమ్మలు. ఇవన్నీ నీవే.

మ ణి :

(క్రింద కూచుని రాళ్ళు గారాంగా చేస్నుకుంటూవుంటాడు. విశ్వ రూపాచారి తనింట్లో వున్న బొమ్మలన్నీ అతనిముందు పెడ్తాడు. వాట్ని విరజిమ్ముతూ) ఊఁ-ఊఁ నాకి పిచ్చిబొమ్మలేం అక్కర్లేదు. నాకు పుల్లమేకావాలి (మారాం చేస్తాడు).

వి శ్వ :

వెధవగుర్రం అట్లాంటి గుర్రాన్ని లక్షతొంబై తయారు చేస్తా. నేను చేసిన యీ బొమ్మలముందు అది దిగ దుడుపుకైనా పనికిరాదు. ఇదిగో యీపెద్దపులి చూడు ఎంచక్కావుందో అని తనుచేసిన పెద్దపులిబొమ్మ యివ్వబోతాడు.

మ ణి :

(విసిరికొడ్తాడు. పెద్దపులి బొమ్మ క్రిందపడి కాలువిరుగుతుంది.)

వి శ్వ :

(కోపంతో పిల్లాడ్ని ఒక్కటి కొడ్తాడు) నిక్షేపంలాంటి బొమ్మను నీ పొట్టను పెట్టుకున్నావు కదరా.

మ ణి :

(క్రిందపడి దొర్లుతూ వెక్కి వెక్కి ఏడుస్తాడు)

వి శ్వ :

(నెత్తిన చేతులు పెట్టుకుని) మాయలోకం. రోజులు మారి పోయాయి. వస్తువు విలువ తెలియని రోజులువచ్చాయి.

చెమటోడ్చి తయారుచేసిన నాబొమ్మలు దమ్మిడీకి పనికిరాకుండా పోతున్నాయి. దమ్మిడీకి కొరగాని ఈ విదేశీబొమ్మల ముందు (కొడుకును చూస్తూ) నాకడుపున చెడబుట్టాడు. వీడికూ్కుడా విదేశీబొమ్మల మోజుపట్టు కుంది. (అనుకుంటూ ఎత్తుకుని యింట్లోకి తీసుకుపోబోతూం డగా మోహన్‌బాబు గుర్రాన్ని తీసుకు వాళ్ళనౌకరు వస్తాడు. దానిముందరి కాళ్ళు రెండూ విరిగివున్నాయి. మూతిక్రింద దవడ విరిగిపోయింది.)

మ ణి :

(గుర్రాన్నిచూచి ఏడుపంతా మాని) అదిగో గుఱ్ఱం. నాదే. అది నాక్కావాలి. (అని తండ్రి చంకలోంచి దిగబోతాడు.)

వి శ్వ :

(కొడుకును గట్టిగా పట్టుకుని నౌఖరుతో) ఎందుకు బాబూ దాన్ని నాకొంపమీదికికూడా తెచ్చారు?

**నౌ క రు :**

ఇది బజార్నించి తెచ్చిన క్షణంలోనే విరిగిపోయింది. మోహన్‌బాబుగారు దీనిమీన్నించి పడిపోయారు. బాగా దెబ్బలు తగిలాయి. ఆయనకి కట్లు కట్టించటానికి ఆస్పత్రికి తీసుకువెళ్లారు. మోహన్‌బాబుగారు దీని కూ్కుడా కట్లు కట్టించమని గోలచేస్తున్నారు. అంచాత దీన్ని మీదగ్గరకు పంపారు. ఓ గంటలో మరమ్మతు

చేసి యిప్పించండి. (అని దాన్ని అక్కడ వదలి వెళ్ళి పోతాడు.)

విశ్వ:

(గుర్రాన్ని కోపంగా చూస్తాడు)

మణి:

నాగుల్లం. నేనెక్కుతా. (అని సంతోషపడ్తూంటాడు.)

విశ్వ:

(కొడుకును మరోటి చరుస్తాడు వీపుమీద) దిక్కుమాలిన గుర్రం. నాకూట్లో మన్నోస్తోంది. మోహన్‌బాబుకు మూతిపళ్లు విరగ్గొట్టిందిట విన్నావా? యింకా నీకుబుద్ధి లేదు. నిన్నుకూడా పడేస్తుంది. అది మనకొద్దు.

మణి:

(ఈ మాటలు వినిపించుకోకుండా ఏడుస్తూనే మారాంచేస్తాడు గుర్రాన్ని చూపుతూ "అది నాక్కావాల"ని.)

విశ్వ:

నిన్నూ- నరికినా పాపంలేదు. పద. మీ అమ్మదగ్గర వప్పచెప్పేస్తాను. (అని లోపలకు తీసుకుపోతాడు.)

(విశ్వరూపాచారి కొడుకును యింట్లో దిగవిడచి ఒక్కడూ తిరిగి ప్రవేశిస్తాడు.)

(గుర్రం మెడ పట్టుకుంటాడు. దాని పనితనాన్ని పరీక్షిస్తూ.)

విశ్వ :

(అవహేళనగా) బాగు- బాగుచెయ్యాల్ల. (అని మెడవద్ద చీటీ చూస్తాడు.) అరె! దీనిమెళ్ళో ఏదో చీటీవుందే. (దాన్ని చదివి తెల్లబోయి) ఐదురూపాయలా? !! ఆ !!! చాలా చౌకేనే. విదేశంలో తయారైన దీన్ని యింత చౌకధరకి ఎలా అమ్ముతున్నారబ్బా!

ఇక గుర్రం కల్పించుకుని మాట్లాడ్తుంది.

! ! !

గుర్రం :

నువ్వు నీ జన్మలో నన్నింత చౌకగా తయారుచెయ్య గలవూ?

విశ్వ :

(తెల్లబోయి) చెయ్యలేను. (స్వాభిమానంపైకొస్తుంది. చిరు నవ్వుతో) ఎక్కి ఎక్కంగానే కాళ్లు విరిగే చచ్చు మోహాన్ని నా ఎత్తుధనం పోసినా నేను చెయ్యలేను.

గుర్రం :

(కాసేపు కన్నీళ్ళు కార్చి) అది నాతప్పుకాదు. నన్నుచేసిన వాడితప్పు అంతకన్నా కాదు.

విశ్వ :

ఊః నిన్ను కొన్నవారి తప్పుకదూ?!?

గు ౦ర ౦ :

అంతేలే. లోకంలో అంతా తామే మంచివాళ్ళను కుంటారు. నువ్వుచేసిన కుర్చీలు కాళ్ళువిరిగి ఎంత మంది బోర్లా పడలేదు.

వి శ్వ :

నేచేసిన కుర్చీ కాళ్లు విరగటమా? నేను అల్లాంటి కక్కుర్తిపని నాజన్మలో చెయ్యలేదు. చెయ్యను. నిన్ను చేసినవాణ్ణి వెనకేసుకు బాగానే పోట్లాటకి వస్తున్నావు.

గు ౦ర ౦ :

(అటూయిటూ చూసి చిరునవ్వుతో) అబ్బో. నువ్వు చాలా గట్టి శిల్పివే! భగవంతునిసృష్టికన్నా చలనంవుందిగాని నీసృష్టి ఆకల్పాంతం వుంటుంది కాబోలు-

వి శ్వ :

ఆ-—

గు ౦ర ౦ :

చెప్పక్కర్లేదు మనబడాయి. అదిగో ఆ పులిబొమ్మ చూడు, నీపని గట్టితనాన్ని అడక్కుండానే చెబుతోంది. దానిమీద ఎవరూ కూర్చోకుండానే విరిగింది. నేనింకా నయంకాదూ, కూర్చున్న బరువుకి ఆగలేక విరిగి పోయాను.

విశ్వ :

(కోపం వస్తుంది పులిబొమ్మని గుర్రాన్ని వుక్రోషంగా చూస్తాడు.) విసిరిపుచ్చుకు పారేస్తే ఏబొమ్మా ఆగదు.

గుర్రం :

(సకిలించి) అదే నాకూ పట్టినగతి. నన్నుచేసిన శిల్పులు నీకన్నా గట్టివాళ్ళే. ఓడలో నేనున్న పెట్టెని ఎత్తేటప్పుడూ దించేటప్పుడూ యిష్టంవచ్చినట్లు గిరవాట్టేసారు, నాకాళ్ళు విరిగాయి.

విశ్వ :

అవతల గిరగిరతిప్పి గిరవాట్టేయకపోయారూ కుంటి గుర్రాన్ని బజార్లో పెట్టి అమ్మకపోతే.

గుర్రం :

అందులో నాతప్పేంవుంది. నన్ను చేసినవాళ్ళదేం తప్పుంది?

విశ్వ :

చేసిన వాళ్ళంటున్నావు ఎంతమంది చేసారేం నిన్ను.

గుర్రం :

(మొహం పైకిపెట్టి) లెక్కలేదు. బహుశా ఓ డజను మందైనా చేసివుంటారు. నాకాళ్ళు కళ్లా, నడుం ఒకళ్లా, తల ఒకళ్ళా, రంగులొకళ్లా, యిలాగే

ఏభాగానికాభాగం ఎవరి యిళ్ళల్లోవాళ్ళు తయారుచేసి అన్నిభాగాలూ ఒకచోటకలిపి నాకీరూపం "అంటే కాళ్ళు విరక్కముందున్న రూపం" యిచ్చారు.

విశ్వ :

(ఆశ్చర్యంగా) నిన్ను ఒక్కళ్లు చెయ్యలేదన్నమాట. అందుకా అంత చవుకగా గిట్టుబాటయింది నీధర!

గుర్రం :

బహుశా అవచ్చు. ఎంచేతంటే పూర్తిగా ఒకవస్తువుని తయారు చేసేకంటే అలా తలోక్కళ్లూ తలోభాగం తయారుచేస్తే మజూరీ ఎక్కువ గిట్టుబాటవుతుంది, నిపుణతకూడా ఎక్కువగానే వుంటుంది.

విశ్వ :

నిపుణత ఏడ్చినట్టుగానే వుంటుంది. చూస్తూనేవున్నాంగా నీలోని నిపుణత.

గుర్రం :

నాలోని నిపుణతకేం. ఇందాకానే చెప్పాగా నాకుపట్టిన గతి. అశాపాతకుడు ఈవూళ్లో నన్ను అమ్మిన ఆసామి.

విశ్వ :

ఏం చేశాడేం ?

గు ఱ్రం :

ఏం చెప్పమన్నావు. నన్నూ, నావిరిగిన కాళ్ళని చూడగానే వలవలాఏడ్చాడు. నాకు చాలా ఆనందం కల్గింది, మనుషుల్లో ఎంత సానుభూతివుందా అని. కానీ నా వూహాలన్నీ మరుక్షణంలోనే మారిపోయాయి.

వి శ్వ :

ఏం? ఏం?

గు ఱ్రం :

నీలాంటి శిల్పినే మరోణ్ణి పిలిపించి నాకాళ్ళని అతికింపించి మక్కు పెట్టించాడు.

వి శ్వ :

నాలాంటి అంటున్నావు. నే నెప్పుడూ అలాంటి పని చెయ్యలేదు.

గు ఱ్రం :

నీలాంటివాడు కాకపోతే మరోలాంటి వాడనుకో. అతను చేసినపని తప్పంటావా కాదంటావా ? అన్ని గుఱ్రాలమీద వచ్చినలాభం చాలదూ, కుంటిదాన్ని నన్నుకూడా మోసంమీద అమ్మటంఎందుకూ? మోహన్ బాబు ముక్కుమోహం విరగ్గొట్టడం ఎందుకు? (కన్నీళ్ళు కారుస్తుంది).

విశ్వ :

ఏమిటో అనుకున్నాను. నీకథ చాలావుందే! అయితే మోహన్‌బాబు ముక్కు మోహం ఏకంగావటంలో నీ తప్పేం లేదంటావు.

గుర్రం :

లేదు. తాటాతూటీగా అతికిన నన్ను ఎవరు సరీగ్గా పరీక్షచేసినా కొనరు. కానీ నాకర్మకాలి మోహన్‌బాబు గారి నాన్నగారికా కొట్లో కాతావుందట. వారు పరీక్ష చేసి చూడకుండానే ఓ గుర్రాన్నిమ్మన్నారు. షాపువాడు ఏదో సామెత చెప్తారు చూశావూ-

విశ్వ :

మోసం ఎరుగున్నవాణ్ణిన్నా చేయ్యాలి, లేక-

గుర్రం :

ఆ- ఆ- అంతలో ఆగు- ఎవరో వస్తున్నారు. [ఇంట్లో మణిభూషణాచారి పరుగెత్తుకుంటూవచ్చి గుర్రాన్ని కావిలించుకుని] నాగుల్లం - ఇదినాదీ - నేనివ్వను. నేనే ఎక్కుతా.

విశ్వ :

(తెల్లబోయి చూస్తాడు)

గుర్రం :

(విజయ సూచకంగా) అమాయకులు. దేవసమానులు. నీకూ నీకడుపున పుట్టిన యీ పసివాడికి ఏంతతేడా-

విశ్వ :

నోరుమూసుకో పెద్దనీతులు చెప్పవస్తున్నావు. అభం శుభం ఎరుగని పిల్లల్ని ఎంతమందిని పొట్టబెట్టు కున్నారో నువ్వూ నీజాతీని.

గుర్రం :

మేం కాదయ్యోయ్, మీరే!! స్వార్థంకోసం ఏమన్నా చేస్తారు!!! (ఆలోచిస్తూ కంటనీరు పెట్టుకుని)నేను మోహన్ బాబు నామీద ఎక్కకుండానే నాకాళ్ళు విరిగిపోతే బావుణ్ణని ఎన్నిదేవుళ్ళనో ప్రార్థించాను. ఆఖరికి రిక్షా వాడన్నా క్రిందపడేసి నాకాళ్లు విరక్కొడితే బావుణ్ణను కొన్నాను. అబ్బే వాడెందుకు విరగ్గొడతాడూ! యింతకీ మీచేత నాకు తిట్లు తినాల్సినరోజు వ్రాసిపెట్టివుంది!!

మణి :

(గుర్రంమీద ఎక్కి పడిపోయి ఏడుస్తాడు)

విశ్వ :

(కోపంతో) వద్దని చెబ్తే విన్నావూ? అనుభవించు. దీన్నిముక్కలు ముక్కలుచేసి పారేస్తేగానీ నీగోల అణగదు.

(అని గుర్రాన్నితీసి నేలకేసి విసిరికొడ్తాడు,)

(మణి : "నాగుల్లం నాగుల్ల" అని ఏడుస్తూ విరిగిన ముక్కల్ని ప్రోగుచేస్తాడు.)

(కట్లు కట్టిన మోహన్‌బాబుని ఎత్తుకుని నౌకరు వస్తాడు. ఈ దృశ్యంచూసి తెల్లబోయి,)

అదేటిబాబూ అలాగిరక్కొట్టినారు ముద్దులు మూట గట్టే గుఱ్రాన్ని.

విశ్వ :

(కోపంతో) ముద్దులు మూటగడ్తోందీ! చూడు - ఏపాపం ఎరగని పసిపిల్నోలా పొట్టపెట్టుకుంటోందో!! ( మోహన్‌ని, తనకొడుకుని చూపిస్తాడు.)

మోహ :

(నౌఖరు చంకలోంచి జార్తూ) నాగుల్లం. పాపం విరిగి పోయింది. దెబ్బలు తగిలాయి. కట్లు కట్టించవేం అప్పలస్వామీ. (గుఱ్రం ముక్కల్ని ఆప్యాయంగా తీస్తాడు. మణిభూషణుడితో పాటు.)

మణి :

నాదీ (అని దాచుకోబోతాడు విరిగిన గుఱ్రంతలని)

మోహన్ :

ఆగమ్మా మరి. పాపం దాని తలాకాళ్ళూ విరిగి పోయాయి. కట్లు కట్టించి యిద్దరం ఆడుకుందాంలే (విరిగిన గుఱ్రంతల విశ్వరూపాన్ని వెక్కిరిస్తూ చూచింది. పాపం అది మాట్లాడలేకపోయింది. మాట్లాడేవుంటే యీక్రింది విధంగా అని వుండేదేమో).

అసూయాపరుడా!— చూచావా యీ అమాయిక హృదయాన్ని తన, పరఅన్నభేదం లేకుండా కోపమూ, తాపమూలేకుండా నామీదెంత జాలి తలుస్తున్నారో. నోరులేని నన్నూ, యీర్ష్యాకోపమూలేని వీర్నీ, సహకార సిద్ధాంతాలమీద తయారైన నన్నూ చూచన్నా బుద్ధితెచ్చుకో. పురోగమించే లోకంతో నువ్వూ పురోగమించు. బూజుపట్టిన పాతపద్ధతుల్ని పాతసిద్ధాంతాల్ని వదలి నలుగుర్నీ కూడగట్టుకుని నాకన్నా మంచి శిల్పాన్ని తయారుచెయ్యి ఒకళ్లు బాగుపడిపోతున్నారే అని ఎన్నాళ్లు ఏడి స్తేమటుకు నువ్వు బాగుపడగలవు?!?

( తెర వాల్తుంది )



# దేవరహస్యం

( మూడు దృశ్యాలు )

గుంటూరు హైస్కూలు సౌలభ్యంకోసం వాడబడింది, అంతేగాని యీనాటికలోని ఘటనలు, సంభాషణలు గుంటూరులోని (అమాటకొస్తే మరేవూరి స్కూలులో (గాని) జరిగివుండినవి కావు. ఈ నాటిక మొదటినుంచి చివరవరకూ కల్పితం.

—రోహిణి.

1. ప్రసాదరావు
2. ప్రకాశరావు
3. గోపాలం

(1–3: (గుంటూరు) హైస్కూలు విద్యార్థులు ఐదవఫారం చదువుతున్నారు. గోపాలం స్కూలు నాటకసమాజ కార్యదర్శి.)

4. అశరీరవాణి (తెరలో నుంచి)
5. దేవేంద్రుడు పిల్లలువేసిన వేషం
6. భగవంతుడు ,,
7. హెడ్మాస్టారు స్కూలు హెడ్మాస్టరు

మరికొందరు పిల్లలు

# దేవరహస్యం

## మూడు దృశ్యాలు

ఒకటవ దృశ్యం-

గుంటూరులోని ఒక హైస్కూలు పిల్లలు ఎక్స్‌కర్షనుకి అమరావతి వెళ్ళారు. అమరావతి గుంటూరుకి 21 మైళ్ళ దూరంలో వుంది. అక్కడికి వెళ్ళటానికి విరివిగా బస్సులున్నాయి.

అక్కడ చారిత్రాత్మక స్థలాలూ, శిథిలాలూ, బౌద్ధశిల్పాలూ విద్యార్థులంతా చూచారు. కృష్ణానదిలో స్నానంచేసి అమరలింగేశ్వరస్వామిని ఆరాధించారు.

ఎక్స్‌కర్షను పార్టీలోని యిద్దరు విద్యార్థులు అమరలింగేశ్వర స్వామివారి ఆలయంలో వోమూలచేరారు. వారిపేర్లు ప్రసాదరావు, ప్రకాశరావూను. హిందీప్రభావం వల్ల వారు "ప్రసాద్" "ప్రకాశ్" అయినారు.

ఈ నాటికలో వాళ్ళనలాగే వాడుదాం !

ప్ర సా :

ఏరా! నీకిదంతా చూస్తే అదోలా లేదూ?

ప్ర కా :

ఏదంతా ?! ఏదోలా ?!?

ప్ర సా :

అదేరా. ఇది అంటే యీగుడీ ఇక్కడ్నించీ కనుపిస్తున్నా- అదిగో, ఆ పవిత్ర కృష్ణాస్రవంతి. గుళ్లో

వున్న అమరేశ్వరస్వామివారి లింగావతారం మనం మరో ప్రపంచంలో వున్నట్టు లేదూ?

ప్ర కా :

ఆ ఏమిటో పోదూ. ఇవన్నీ క్షణికాలేకదా! రేపీపాటికి స్కూల్లో మనకి వచ్చినా అర్థంకానిపాఠాల్తో సతమత మవాలి.

ప్ర సా :

హోరన్నీ తస్సాచెక్కా. ఇవి క్షణకాలట్రా? స్కూలు శ్వాశ్వతమా?

ప్ర కా

కాదనుకో. ఆమాటకొస్తే ఏదీకాదు. అయినా రేపు లెక్కలమాష్టారికేం సమాధానం చెబుదామా అని-

ప్ర సా :

రేపటిగోల యిప్పుడెందుకురా? యీ ఆలయంలోకూడా పాఠాలూ లెక్కలేనా? యిక్కడ మరేమన్నా ఆలోచించరాదూ?

ప్ర కా :

ఏమాలోచించినా పాఠాలూ తప్పవు. పరీక్షలూ తప్పవు.

ప్ర సా :

[తేలుకుట్టినట్టు ఎగిరిపడ్తూ వేలు యూడిస్తాడు.) ఒరేయి నాకో చక్కని ఆలోచన తట్టిందిరా.

ప్ర కా :

ఏమిటది? పాఠాలు చదవకుండా పరీక్ష ప్యాసయే సూత్రమేదన్నానా?

ప్ర సా :

ఎప్పుడూ పాఠాలూ పరీక్షలూను మహా చదివేవాడికన్నా లేదుగాని.

ప్ర కా :

చదివేవాడికి వాటి గోలే లేదు. చదవని నాలాటివాడికే కావాలి.

ప్ర సా :

ఉత్తగొడ్డుకి అరుపు లెక్కువని!

ప్ర కా :

ఇంతకీ నీ ఆలోచనేమిటో చెప్పావుకావు.

ప్ర సా :

నువ్వు న్యూసుపేపరు చదువుతుంటావు కదూ.

ప్ర కా :

సరే- పాఠాలొకటి గతిలేదుగాని న్యూసుపేపర్లదాకా పోయినావు!

ప్ర సా :

ఈమధ్య చంద్రమండలానికి ప్రయాణం చెయ్యాలని అమెరికాలోనో మరెక్కడో కొన్ని విమానాలు తయారు చేస్తున్నార్ట. వాట్ని రాకెట్ లంటారట.

ప్ర కా :

అవును. ఆ సంగతి నేనూవిన్నాను. మానాన్నగారు చదివి చెబ్తుండేవారు.

ప్ర సా :

అవునా- మనం స్వర్గానికిపోయే వుపాయం ఎందుకు కనిపెట్టగూడదూ.

ప్ర కా :

(అదోలా చూస్తూ) స్వర్గానికా - దానికి వుపాయం నువ్వు నేనూ కనిపెట్టేదేమిటి ఛ స్తేసరి! ఛామ్మిన స్వర్గానికి పోవచ్చు!!

ప్ర సా :

అబ్బ అదికాదురా. చావకుండా. అంటే, యిలా నుంచున్నపాళంగా-

(ఈ సంభాషణ జరుగుతూండగా వెనకనుంచి గోపాలం ప్రవేశించి వీరి సంభాషణలు విని స్తంభంచాటున నక్కుతాడు.)

ప్ర కా :

వెనకటికెవడో యిలాగే ప్రయత్నంచేసి అప్పటికి యిప్పటికీ ఆకాశంలో తలక్రిందులుగా వ్రేళ్ళాడు తున్నాట్ట. అటు స్వర్గమూకాక, యిటు భూమీకాక!

ప్ర సా :

త్రిశంకుడులే. అదే నాఆలోచనకి మూలం అనుకో. అంటే స్వర్గానికి బొందితోవెళ్ళటం అనే ప్రయత్నం లోగడ జరిగిందన్నమాట. దానికితోడు యిప్పుడు చంద్రమండలానికి ప్రయాణ సన్నాహాలు జరుగు తున్నాయి. మనం స్వర్గానికి వెళ్లే ప్రయత్నాలుచేద్దాం.

ప్ర కా :

మనం అంటే నువ్వా నేనూనా?

ప్ర సా :

ఊఁ!

ప్ర కా :

ఏడిశావులే ఆట్టే పోకిళ్ళుపోకు. అమ్మనీ నాన్ననీ ఏడిపించి ఐదురూపాయలు తీసుకుని అమరావతి ఎక్స్ కర్షన్‌కి రాంగానే మెదడు ఆకాశంలో పచార్లు కొడ్తున్నట్టుందే. చంద్రమండలానికి వెళ్లేందుకు రాకెట్‌కి ఎంతవుతుందో తెలుసా? కొన్నికోట్లు కావాలి.

ప్ర సా :

దేముడ్ని అడిగి తీసుకుపోమ్మందాం.

ప్ర కా :

ఏమనుకుంటున్నావురా నీమటుకు నువ్వు? నువ్వేం మహాయోగివనా?

ప్ర సా :

అయినవాళ్ళంతా మనకన్నా ఎక్కువంటావా? నిర్మలాంతఃకరణలో దేముడ్ని ప్రార్థిస్తే సరి. ఆయనే తీసుకుపోతాడు.

ప్ర కా :

మాఅమ్మనీ నాన్ననీ వదలి నేను రాదల్చుకోలేదు. కావలిస్తే నువ్వు ప్రార్థించి నువ్వేవెళ్ళు. (లేచి దుమ్ము దులుపుకు పోబోతూ) పొరబాట్నన్నా నాపేరుకూడ చెప్పకు దేవుడికి. నేను రాను స్వర్గానికి (పరికించి చూస్తూ) అంతా వెళ్ళిపోతున్నారు. పద. వాళ్ళుకనక మనల్ని వదలిపెట్టి వెళ్తే అమరావతి నుంచి గుంటూరు నడిచివెళ్ళాలి. దేవుడిక్కడే కనిపిస్తాడు, స్వర్గందాకా పోకుండానే.

ప్ర సా :

(ఆలోచిస్తూ లేస్తాడు.)

(ఇద్దరూ నిష్క్రమిస్తారు.)

స్తంభంచాటున నక్కిన గోపాలం "పొట్టివాడికి పుట్టెడు బుద్ధులట. స్వర్గానికి ప్రయాణం కడ్తాడేం- సరేకానీ" అని తలపంకిస్తూ వారివెంటే వెళ్ళిపోతాడు.

( తెర వాల్తుంది )



## రెండవ రంగం

(తెర ముందు)

(ప్రసాదరావు ఆలోచిస్తూ నడుస్తూంటాడు. చేతిలో పాఠ్యపుస్త కాలుంటాయ్) వెనకనుంచి గోపాలం వస్తాడు.

గో పా :

ఏరోయ్ ప్రసాదం ఏమిటి దీర్ఘంగా ఆలోచిస్తున్నావు. నడిరోడ్డున పరధ్యాన్నంగా నడవకు. ఏపొగాక్కంపెనీ లారీక్రిందో పడిపోగలవు!

ప్ర సా :

(వెనక్కి తిరిగిచూచి) నువ్వా గోపాలం. ఈవాళ యిటు వస్తున్నావేం రిహార్సల్సుకు పోలా.

గో పా :

యివాళ భోజనాలైనాకలే. నాటకం యిక ఆట్టేరోజులు లేదుగా. రేపులేదు ఎల్లుండే. అంచాత ఈరాత్రి పూర్తి నాటకం ఎంచుమించు డ్రస్ రిహార్సలన్నమాట. అంచాత ఆలస్యం అవుతుందని అన్నాలు తిని రమ్మన్నాను అందర్నీని.

ప్ర సా :

అంటే నువ్వేనా ఏమిటి డైరక్టరువు.

గో పా :

నీ కిన్నాళ్లనుంచీ తెలీదా ఏమిటి? నాటకం వ్రాసింది మనం, వేయించేది అంటే డైరెక్టుచేసేది మనం, హీరో వేషం వేసేది మనం.

ప్ర సా :

చూసేదికూడా మనమేనా?

గో పా :

(చిన్నబుచ్చు కుంటాడు)

(ప్రకాశరావు అటునుంచి వస్తూ ఎదురౌతాడు)

ప్ర సా :

ఎక్కడికిరోయ్ వెనక్కివస్తున్నావు ఏమన్నా మర్చి పోయినావా?

గో పా :

నీకోసమే లాగుంది. వాడ్ని విడిచి నువ్వొక్కడివీ ఎక్కడ స్వర్గానికి పోతావోనని భయం పట్టుకున్న ట్టుంది. అంచాత వెనక్కి తిరిగివచ్చాడు.

ప్రకా, ప్రసా :

(యితనివంక ప్రశ్నార్ధకంగా చూస్తారు)

గో పా :

(నోరు నొక్కుకుంటాడు.)

ప్ర సా :

అయితే మేం స్వర్గానికి పోతున్నామని నీకేం తెల్సు?

గో పా :

'రవి కాంచనిచో కవిగాంచున్' అన్నాడుశాస్త్రకారుడు. మనకి నిన్నరాత్రి శంకరుడు కలలో కనిపించి "ఒరేయ్ భక్తాగ్రగణ్యా నీస్నేహితులలో ఒకడైన ప్రసాద్ బొందితో స్వర్గానికి వెళ్ళాలని తీవ్రంగా ఆలోచిస్తు న్నాడు. వాడి ఆలోచనకి స్వర్గంఅంతా అట్టుడికినట్టు వుడికిపోతోంది. నాకు వాడిఆలోచన చూస్తే ఈవాళో రేపో స్వర్గానికి వచ్చేస్తాడని నమ్మకంగా వుంది కనుక-

(అని ఆగిపోతాడు).

ప్ర సా :

ఊఁ కనుక- ఏమన్నాడేం?

గో పా :

స్వర్గానికిపోయే వుపాయం చెప్పాన్రా!

ప్ర కా :

(తెల్లమొహం వేసి) నిజమే?

గో పా :

అబద్ధ మనుకున్నా?

ప్ర సా :

ఏమిట్రా ఆ వుపాయం?

గో పా :

అబ్బాయి దేముడంటే దేముడేననుకో ఎంత సులు వైన వుపాయం అనుకున్నా!

ప్ర సా :

అదేమిటో చెప్పరాబాబూ చంపక.

గో పా :

అబ్బే యిప్పుడుకాదు. దానికి తరుణంరావాలి. చూడు నువ్వు యీరాత్రి మా రిహార్సలుకు రాగలవా?

ప్ర సా :

(ఆలోచించి) ఆ.

గో పా :

అయితే అక్కడ చెబుతాలే.

ప్ర కా :

అందర్లోనూ ఎగతాళి పట్టించి ఏడిపించడానికి.

గో పా :

ఛీ కాదురా నిజంగా. మీరిద్దరూకూడా తప్పక రండి.

(నిష్క్రమిస్తారు)

## మూడవ రంగం
(తెర లేస్తుంది)

గోపాలమూ మరికొందరు పిల్లలూ రిహార్సలు రూములో వుంటారు.

గో పా :

స్స (అని ముక్కుమీద వేలేసుకుని) ఎవళ్ళపార్టు వాళ్ళు తూ. చ. తప్పకూడదు. ప్రాంప్టింగుండదు. జాగ్రత్త. అదిగో అలికిడి అవుతోంది. వాళ్ళు వస్తున్నట్లున్నారు. అంతా దాక్కొండి (ఎక్కడివాళ్ళక్కడ దాక్కుంటారు)
Note : ప్రదర్శించేటప్పుడు ఆట్టేమందిపిల్లలు దొరక్క పోతే తెరలోనే వున్నట్టు గోపాలం పాత్రధారి నటించ వచ్చు.
ప్రసాద్ ప్రకాశ్‌లు బిక్కుబిక్కుమంటూ ప్రవేశిస్తారు.

గో పా :

(వికటంగా నవ్వి) భయపడ్తారేం రా, రండి.

ప్ర కా :

(కలయజూచి) ఎవళ్లూ లేరేం.

గో పా :

ఈవాల్టికి రిహార్సలు ఆపేసాం.

ప్ర సా :

ఏం ?

గో పా :

మేకప్‌మేనుకి తలనొప్పి వచ్చిందిట.

ప్ర సా :

అయితే డ్రెస్ రిహార్సలేద్దామని నిజంగానే అనుకున్నా రన్నమాట.

గో పా :

ఆ-

ప్ర సా :

మరింకా నువ్విక్కడే వున్నావేం?

గో పా :

మీకోసమే- దేవరహస్యం చెబుదామని.

ప్ర సా :

చెప్పు మరి.

గో పా :

నీకు దక్షయజ్ఞం కథ తెలుసా?

ప్ర సా :

ఆ.

గో పా :

యజ్ఞయాగాదులలో హవిర్భాగాలు అగ్నిద్వారా దేవత లకి అందజేస్తారని తెలుసా?

ప్ర సా :

ఆ. మా అమ్మమ్మ చెప్పేది కథల్లో.

ప్ర సా :

అయితే మనం స్వర్గానికి పోవాలని వో చీటీ వ్రాసి కుంపట్లో పారేస్తేసరి దేముడికి అందుతుంది.

గో పా :

అదీ దేవరహస్యం. సరిగ్గా యిదే నాకూ కలలో కని పించిన శంకరుడు చెప్పింది.

ప్ర సా :

అయితే కుంపట్లో దాఖలుచేస్తే మనపని జరుగుతుం దంటావు.

గో పా :

నిర్మలాంతఃకరణతో చేస్తే సరి.

ప్ర సా :

ఈమాట చెప్పడానికి యింతదూరం పిలిపించావే. ఈ సంగతి యిందాకానే చెబ్తే యీపాటికి యింటిదగ్గరచేసి వుండేవాడ్ని.

గో పా :

యిప్పుడు మటుకు ముంచుకుపోయింది ఏముందీ? రిహా ర్సలుంటాయేమో టీ కాచుకుతాగుదాం అని కుంపటి రాజేసేవుంచాం, కావాలంటే అది వుపయోగించుకో వచ్చు నువ్వు.

ప్ర సా :

నిజంగానే

గో పా :

ఆ (అని వెలిగేకుంపటి తెస్తాడు)

ప్ర సా :

అయితే ఛిటీ రాయమన్నావా?

గో పా ;

నీ యిష్టం.

ప్ర సా ;

కాగితం వుందా

గో పా :

అహో (అని అందిస్తాడు)

ప్ర సా :

కలం.

ప్ర కా :

యిదిగో (అని తన జేబులోంచి యిస్తాడు)

ప్ర సా :

(కాగితంమీద కలంపెట్టి) ఏం వ్రాయమన్నావు?

గో పా :

నీయిష్టం.

ప్ర సా :

(వ్రాస్తాడు)

గో పా :

ప్రకాశ్ వ్రాస్తుంటే విరగబడి చూస్తుంటారు. వ్రాశాక ప్రసాద్ చదువుతాడు.

ఓ భగవానుడా, దయామయుడా, నీకు మొదట్నించీ భారతదేశం అంటే చాలా ప్రీతి అని మా అమ్మమ్మ చెప్పే కథలవల్లా చదివిన పాఠాలవల్లా తెలుసుకున్నాను. మేం యీమధ్యనే స్వరాజ్యం కూడా సంపాయించుకున్నాం, అన్న సంగతి నీకు తెలీకుండా వుంటుందా? మావేదాలూ, శాస్త్రాలూ జర్మన్లూ వాళ్లూ ఎత్తుకుపోయి చాలాచాలా వింతలూ విశేషాలూ సృష్టించారుట. వెనకటి కిట్లాగే సోమకాసురుడు వేదాలు పట్టుకు పారిపోతుంటే నువ్వు చేప అవతారం ఎత్తి అవి తిరిగి వాళ్లాక్కుని మావిమాకిచ్చావుట. అయితేనేం అవి మెం దక్కించుకొలేక పోయాం. అవ్విప్పుడు మాకిమ్మంటే వాళ్ళివటంలేదుట. ఈ పెద్దల

వల్ల ఏంలాభం కనిపించటం లేదు. ఓవేపున యితర దేశాలలో చంద్రమండలానికి ప్రయాణానికి ఏర్పాట్లు జరుగుతూంటే మరోచోట గ్రహాన్ని సృష్టించటానికి ఏర్పాట్లు జరుగుతున్నాయట. నాకు తెలిసినంతవరకూ యిలాంటి ఏర్పాట్లు ఇక్కడేం జరగటంలేదు. కాగా నేను అందరికన్నా ముందు స్వర్గానికి యాత్రచేసే వుపాయకోసం తీవ్రంగా ఆలోచించసాగాను. అదృష్ట వశాత్తు నువ్వు మాగోపాలం కలలో కనపడి స్వర్గానికి పోయే వుపాయం చెప్పావుట. యిందుకు నీకు శత సహస్రప్రణామాలు. నీకు భారతదేశంమీద వున్న ప్రేమని యిది చెప్పకయే చెపుతోంది. అన్నిదేశాల్లాగా మాకు యంత్రబలం లేదుకాని మనోబలంమాత్రం వుంది. తుపాకీ మడమలతో మొత్తుతున్నా కుంయ్,కయ్ మనకుండా సత్యాగ్రహం సాగించగలం. తుపాకీదెబ్బ లకి ఎముకలగుండెలు అప్పజెప్పి గుండు దూసుకు పోతుంటే "హేరామా"అంటూ వీరస్వర్గం అలంకరించ గలం. నిరాయుధులమై, సత్యాగ్రహసమరంలో దేశాలు జయించగలం. యంత్రసహాయం లేకుండా యిన్ని ఘనకార్యాలూ చేయగల మేము స్వర్గానికి వెళ్ళలేమా అనే ధిమా నాకువుంది. కనుక ఓ దయామయా, స్వర్గానికి నన్నూ, మాదేశప్రజల్నీ, యితర దేశప్రజల

కన్నా ముందు తీసుకుపో. యివే నా విన్నపములు.

ఇట్లు

ప్రసాద్ (12 సం॥ లు)

ప్రకా :

బ్రాకెట్‌లో 12 సంవత్సరములు అని ఎందుకురా ?

ప్రసా :

ఉండాల్లే.

గోపా :

బాలయోగి అని తెలియద్దూ దేముడికి! ఊఁ, బాగానే వుంది- దాఖలుచెయ్యి కుంపట్లో. యింకా ఆలోచ నెందుకు?

ప్రసా :

(కళ్ళుమూసుకుని కాగితం కుంపట్లో వేస్తాడు)
ఢాం అని మ్రోగుతుంది. గుప్పుగుప్పున వచ్చేపొగ కావురు క్రమ్ముతుంది. గుంయ్‌మనే శబ్దం 'ఓం' కార నాదంలా వుంటుంది.
Note : (బిందెమూతిలో మూతిపెట్టి మాట్లాడే రీసౌండింగు ఎఫెక్టు వస్తుంది)

అశరీరవాణి :

వత్సా- నీకోరిక నెరవేర్తుంది. అయితే సువ్వో ఘన కార్యం చెయ్యగలవా?

ప్ర సా :

ఏమిటీ ప్రభూ!

అశరీరవాణి :

కాగితం కుంపట్లో దాఖలుచేస్తే నాకు అందింది. అట్లాగే స్వర్గానికి రావాలంటే నీవుకూడా నిప్పుల్లో దూకాలి.

ప్ర కా :

(జనాంతికంగా) అమ్మ బాబోయ్.

ప్ర సా :

ఉస్- (జనాంతికంగా వారించి) అలాగే ధూకుతాం దేవా?

ప్ర కా :

(జనాంతికంగా) నేను ధూకనురా నన్నుకూడా కలపకు. కావలిస్తే నువ్వొక్కడివీ దూకు.

ప్ర సా :

(జనాంతికంగా) ఉస్. ఊరుకోరా ఇది నిజం అనుకున్నా? కథలు వినలా? తీరా మనం దూకబోతుంటే దేవుడడ్డుపడి "వత్సా! నీ భక్తికి సంతసించాను" అని మనం దూకకుండానే స్వర్గానికి తీసుకుపోతాడు.

అశరీరవాణి :

(వికటంగా నవ్వుతూ) బాగా నేర్చుకున్నారా మోసాలు, దేవుడికే పంగనామాలు పెడ్దాం అని చూస్తున్నావే.

అసాధ్యుడివిరా- ఇదిగో మిమ్మల్నందర్నీ స్వర్గానికి తీసుకుపోతున్నా భయపడకండేం. (ఢాం అని ప్రేల్తుంది. కన్నులు మిరమిట్లుగొలిపేకాంతి. 'ఓంకార' (గుంయ్‌మనే శబ్దం) ఎక్కువౌతుంది.)

ప్ర సా :

ప్రకాశ్ ప్రకాశ్ (అని దిక్కులు చూస్తాడు)

ప్ర కా :

(కళ్ళు నులుముకుంటూ) ఊ- ఆఖరికి నన్నుకూడా స్వర్గానికి తీసుకొచ్చావూ వద్దంటున్నా వినకుండా.

గో పా :

మీతోబాటు నేనూ వచ్చాన్రోయ్.

ప్ర సా :

ఆ- మీరంతాకూడా వచ్చారా? (కలయజూచి) అయితే స్వర్గంఅంటే యిదేనా? ఏమీ కనిపించవేం?.

గో పా :

ఏమి కనిపించాలి? అవిగో పెద్దపెద్ద మహాళ్లు.

ప్ర సా :

ఆ కనిపించేదే దేవేంద్ర మహాలనుకుంటాను. పదండి పోదాం.

గో సా :

దేవేంద్రమహాలు వుండాలని కోరుకో చాలు. మనం యిక నడవక్కర్లేదు. ఇది స్వర్గం.

ప్ర సా :

(కళ్లు మూసుకుని) మేం దేవేంద్రమహాలు వుండాలని కోరుకుంటున్నాం.

{ మళ్లా ఢాం అని ప్రేల్తుంది.
ఇక ఆరిపోయిన దీపాలు వెలగవు.
(కరెంటు ఫెయిల్ అయింది) }

(చీకట్లోంచి గొంతుకలు)

దే వేం :

ఎవరన్నా మీరు ముక్కుపచ్చలారని బాలురు. ఏం యిట్లా వచ్చారు.

ప్ర సా :

మీరెవరు దేవా?

దే వేం :

మీరు చూడాలనుకున్న దేవేంద్రుడ్ని.

ప్ర సా :

అంతా యింత చీకటిగా వుందేం.

దే. వేం :

కరెంటు ఫెయిలయింది. (నోరు నొక్కుకుని)

గో పా :

(ఉరిమి చూస్తాడు) ఒక్క దెబ్బ వేసినచప్పుడు.

దే వేం :

అబ్బ!

ప్ర సా :

అదేమిటి ఎవరూ మిమ్మల్ని కొట్టింది?

గో పా :

భగవంతుడు.

ప్ర సా :

ఏడీ ఆయన్ను చూడాలనివుంది.

(లైట్లు వెలుగుతాయి) (భగవంతుడు కనిపిస్తాడు)
అంతా అంజలి ఘటిస్తారు.

ప్ర కా :

(జనాంతికంగా) ఒరేయ్ యిందులో ఏదోమోసం వుంది.
ఈ భగవంతుడు మన 'మోహన్' లాగున్నాడు.

ప్ర సా :

(పరికించి చూసి) అవున్రోయ్. గోపాలం ఏడీ.

గో పా :

(లోపల్నించీ వస్తూ) ఒరేయ్ హెడ్మాష్టారు వస్తున్నారు. పదండి పదండి.

ప్ర కా :

అమ్మ బాబోయ్. స్వర్గంలోక్కూడా వచ్చారూ హెడ్మాష్టారు.

(భగవంతుడు గబుక్కున బల్లమీదనుంచి దూకుతాడు.)

ప్ర సా :

మనతో మాట్లాడకుండానే భగవంతుడు మాయం అయిపోయాడే.

ప్ర కా :

స్వర్గానికి రానేవచ్చానుకదా ఈ పరిక్షలబాధన్నా తప్పించమని దేవుడ్ని అడుగుదాం అనుకున్నాను.

ప్ర సా :

నోరుముయ్. నీ పరీక్షలు నువ్వూను!!

హె డ్మా :

(ప్రవేశించి) ఏమిట్రా యీ అల్లరి. రిహార్సలని ధమ ధమల్లూ, గుసగుసలూను. దీపావళి అనుకున్నారాయేం?

గో పా :

(నంగిగా) ఇదో సీనండీ మాష్టారూ మానాటకంలో.

హె డ్మా :

ఏమిటీ సీను.

ప్ర సా :

సీనేమిటి? యిది స్వర్గంసార్.

గో పా :

(నోరు నొక్కుకుంటాడు)

హె డ్మా :

స్వర్గం సీనా?

ప్ర సా :

సీనుకాదండీ. స్వర్గమే. ఇప్పుడే మేం దేవేంద్రుడితో మాట్లాడేం. భగవంతుడ్నికూడా చూచాం.

హె డ్మా :

ఏమిటోయ్ గోపాలం, యితననేది?

గో పా :

(తడబడుతూ) ఆ యేం లేదండీసార్. (ప్రసాద్‌కి సౌంజ్ఞ చేస్తూ) వీడికీమధ్య స్వర్గంపిచ్చి పట్టిందిలెండి.

(బల్లక్రింద నుండి భగవంతుడు పారిపోతూ అందరికంటా బడ్తాడు.)

హె డ్మా :

వాడెవఁడ్రా. రిహార్సల్స్‌లో ఈ వేషాలుకూడా ఏమిటి?

గో పా :

(డెస్ రిహార్సలు లెండి యీవాళ.

హె డ్మా :

చాలాదాకావుందే. సరే అట్టే పొద్దుపోనివ్వకుండా ముగించి యిళ్ళకి పొండి. ఇప్పటికే చాలారాత్రి అయింది. (నిష్క్రమిస్తాడు).

ప్ర సా :

అయితే యిది స్వర్గంకాదూ ఎందుకురా యింతనాటకం ఆడావు.

గో పా :

పెయ్యమ్మా! కురంపట్లో దాఖలుచేసిన అర్జీల్తో నే స్వర్గానికి పోదాం అని ఆశపడ్డావేం? కాస్సేపు నిన్ను ఏడిపిద్దామనే ఈనాటకం ఆడాను.

ప్ర సా :

న న్నొక్కడ్నీ ఏడిపించడానికి యింత నాటకం ఆడావా? ఎంతడబ్బు తగలేశావురా?

గో పా :

మరేం ఫరవాలేదు. నీలాంటి బూజుపట్టిన పాతచింతకాయ పచ్చడిగాళ్ళని మరమ్మతు చెయ్యందే మనదేశం బాగుపడదు. అందుకు యిదోఖర్చులో లెక్కగాదు.

ప్ర సా :

అయితే ఈకాస్త నాటకంలోనూ నాబుద్ధి మార్చేసానని అనుకుంటున్నావన్నమాట.

గో పా :

అబ్బే! యింతతేలిగ్గానా? రేపటినుంచి నీ స్వర్గలోక యాత్రవిశేషాలు మన స్కూలు వ్రాతపత్రికలో సీరియల్‌గా పడి–

ప్ర సా :

ఆ– ఆపనిమాత్రం చెయ్యకు.

గో పా :

ఏం?

ప్ర సా :

అంతా ఏడిపిస్తారు.

గో పా :

నీకేం. ఎవళ్ళు ఏం అనుకుంటే నీకేం నీ స్వర్గారోహణ–

ప్ర సా :

నీకూ నీస్వర్గారోహణకి ఓ నమస్కారం. ఇక ఈ మాటెత్తను, మన పత్రికలలో మటుకు పడకుండా చూడు.

(పన్నెండు గంటలుకొట్టిన శబ్దం)

ప్ర కా :

అమ్మబాబోయ్ పన్నెండే. నీ స్వర్గంకాదు గాని ఈవాళ మానాన్న నావీపు విమానంమోత మ్రోగించి తీర్తాడు పన్నెండింటిదాకా యింటికి రానందుకు.

ప్ర సా :

(ఖిన్నిచూస్తూ) నన్నుమటుకు పూజ చేస్తారనుకున్నావా?

గో పా :

(నవ్వుతూ) నా నాటకంవల్ల కాకపోయినా, ఆ దెబ్బల వల్లన్నా యిక స్వర్గంమాట ఎత్తవులే.

( తెర )



# బడిగంటలు

పిల్లల ఏకాంక నాటిక

( ఒ కే రం గం )

## పాత్రలు:

1. శేషగిరి
2. గోపాలం

} హైస్కూలు విద్యార్థులు. నాలుగవ ఫారం చదువుతున్నారు. శేషగిరి మేజిస్ట్రేటుగారి అబ్బాయి గోపాలం అతని స్నేహితుడు.

3. రఘునాథ్ జనరాజ్యసంఘ మెంబరు. పైవారిసహాధ్యాయి

4. మోహన్
5. రామారావు

} పైవారి సహాధ్యాయులు.

6. రాజారావు మేజిస్ట్రేటు. శేషగిరి తండ్రి.

7, 8. ఇద్దరు పోలీసులు పోలీసు కాన్‌స్టేబిల్స్.

# బడి గంటలు

(ఏకాంక నాటిక)

[ఒకే రంగం]



సూచన : కొన్ని హైస్కూళ్ళలో చర్చిగంటను బోలిన గంటను బడిగంటగా వాడ్తారు ఈ నాటికలో ప్రదర్శకులు దాన్నే వాడాలి.

తెర నెత్తగా రాజారావుగారి యింట్లో శేషగిరి, గోపాలం లెక్కల పుస్తకాలు ముందువేసుకొని "హోం వర్కు" చేస్తూ కూర్చుంటారు. శేషగిరి రాజారావుగారి కుమారుడు. గోపాలం అతని స్నేహితుడు. వీళ్ళు అవూళ్ళోని హైస్కూల్లో నాలుగవ ఫారం చదువుతున్నారు.

గో పా లం :

నువ్వేదో తెలివిగలవాడివని నీ దగ్గరకి వస్తే నీవల్లా కాలేదే యీలెక్క చెయ్యటం. ఈవాళ లెక్కల మాష్టారి చేతుల్లో చావుదెబ్బలు తప్పవన్నమాట!!

శే ష గి రి :

ఆగరా అలా ఖంగారుపడ్తావేం! ఇదిగో వచ్చేస్తోంది ఆగు. (లెక్కవేస్తూ వుంటాడు.)

గో పా :

(అతడు లేస్తూంటే చూస్తూంటాడు) (క్షణం ఆగి) వచ్చిందా ఆన్సరు.

శే ష :

ఆ- చూడు 420 రైటేనా?

గో పా :

తప్పు - 240 రైటాన్సరు. (అచ్చుపుస్తకంలోని ఆన్సరు చూచి చెబుతాడు.)

శే ష :

ఊఁ?!- సరిగా చూడు.

గో పా :

కావాలంటే నువ్వే చూసుకో. ఇదిగో పుస్తకం. (పుస్తకం అతనిముందు పడేస్తాడు)

శే ష :

(చూచి) అయితే ఎక్కడ తప్పొచ్చుంటావు? (అని మళ్ళీ సుమారు లెక్కంతా చూచుకుంటాడు.) బహుశా అచ్చు తప్పనుకుంటాను. 420 ఆన్సరు రైటే.

గో పా :

అచ్చు తప్పేమిటి?!? నీ తలకాయ!!! ఏదో తెలివిగల వాడివనుకుంటుంటే నీమతికాస్తా పోతున్నట్టుంది. అచ్చు ఎక్కడన్నా తప్పవుతుందా?!?

శే ష :

అవచ్చు. ఈ పుస్తకంలోని ఆన్సర్సు చాలా తప్పు లున్నాయని మేష్టారు అంటుంటారు. ఇదీ తప్పుడు ఆన్సరేనని నానమ్మకం.

గో పా :

ఏదీ నువ్వుచేసిన లెక్క ఎక్కించుకుంటాను.

శే ష :

దబ్బున ఎక్కించుకో బడివేళయింది.

(క్షణం అయినాక నేపథ్యంలో బడిగంటలు వినిపిస్తాయి.)

శే ష :

అవిగో బడిగంటలు కొడుతున్నారు. లే. లే. దబ్బున పోవాలి. రెండోగంట కొట్టేలోగా స్కూలు చేరుకోక పోతే హెడ్మాష్టారు కాలయముడల్లె గేటుదగ్గర నిల బడి ఆలస్యంగా వచ్చినందుకు చెరోటీ వడ్డిస్తారు.

గో పా :

ఊ అయితే పద స్కూల్లో ఎక్కించుకుంటాలే.
(నేపథ్యంలో బడిగంటలు వినిపిస్తూనే వుంటాయి.)

శే ష :

ఏమిటిది 'లాంగ్ బెల్' కొడ్తున్నట్టున్నారే బడికి శెల విచ్చారా ఏవిటి?

గో పా :

ఆ- అవునురా ఇది లాంగ్ బెల్లే.

సూచన : (ఏలూరు మ్యునిసిపల్ హైస్కూలులో ముందుగా తెలియబర్చని శలవులకు యీవిధంగా "లాంగ్ బెల్" కొడ్తారు. ఇవి విన్న విద్యార్థులకూ టీచర్లకూ ఆరోజు బడికి శెలవు అని తెలుస్తుంది.)

శే ష :

ఈవేళ ఎందుకు చెప్మా శెలవు?

గో పా :

ఎవరన్నా చచ్చిపోయినారేమో

శే ష :

ఏమో పాపం,

గో పా :

లెక్కలమేష్టారు బాగున్నట్టేనా?

శే ష :

ఛీ! నోరుముయ్యి. ఎవరన్నావించే నోరునొక్కి చంపుతారు.

గో పా :

(నోరు మూసుకుని) పద పోసి అదేమిటో తెలుసుకుని వద్దాం స్కూలుదాకా వెళ్ళి.
(గంటల శబ్దం ఆగిపోతుంది)

గో పా :

(బైటికివెళ్ళి చూసి) అడుగో మోహన్ పరుగెత్తుకుంటూ వస్తున్నాడు వాడ్ని అడిగితేసరి సంగతేమిటో. అరెయ్ మోహన్ "లాంగ్ బెల్" కొట్టారెందుకురా యివాళ?
(మోహన్ పరుగెత్తుకుంటూ వచ్చి వీళ్ళ గుమ్మముందు ఆగుతాడు రొప్పుకుంటూ.)

మో హ :

స్ట్రైక్ - స్ట్రైక్ రా. యివాళ బళ్ళోకి వెళ్లకూడదు.

శే ష :

అయితే లాంగ్ బెల్ కొట్టారేం? హెడ్మాష్టారే స్ట్రైక్ చేయిస్తున్నారా?

మో హ :

తమాషా జరిగిందిలే. తర్వాత చెబుతా (అని పారిపోతాడు,

శే ష :

అరే అసలు సంగతి చెప్పకుండా పారిపోయాడే.

గో పా :

స్ట్రైకేమిటి!? లాంగ్ బెల్లేమిటి?! ఏదో మోసం జరిగింది. పద స్కూలుకువెళ్ళి అసలు సంగతి తెలుసుకుందాం.

శే ష :

అడుగో రామారావు వస్తున్నాడు. వాడ్ని అడుగుదాం.

గో పా :

ఒరేయ్ రామారావు యిలారా. ఏమిటిరా హడావుడి? స్కూలులో స్ట్రైకుట ఎందుకూ?

రా మా :

(లోపలికి వచ్చి) ఆ. పని లేకపోతే సరి. ఇదేదోసంఘం లేదూ, వాళ్లూ పొద్దున్న సాయంకాలం స్కూలు ఆవరణలో సంఘ కార్యక్రమాలు చేసుకుంటున్నార్ట. అది వల్లకాదన్నార్ట హెడ్మాష్టారు.

గో పా :

ఊఁ- అయితే.

రా మా :

ఈవాళ పొద్దున్న కార్యక్రమం జరక్కుండా హెడ్మాష్టారు వచ్చి అడ్డం పెట్టారట. అయితే మేం ఈ స్కూలే జరక్కుండా చేస్తాం అన్నారట. వాళ్ళు స్ట్రైకు చెయ్యమని పిల్లలందర్నీ అల్లరి పెట్టున్నారు.

శే ష :

అంతా బాగానేవుంది గాని లాంగ్ బెల్ ఎందుకు కొట్టించారు హెడ్మాష్టారు.

రా మా ;

అదా - తమాషా జరిగిందిలే. మనస్కూల్లో అల్లరిగా తిరిగే కోతిమూక వుంది చూశావు అందులో ఓ పెద్ద కోతి గంట తాడు పట్టుకు అదేపనిగా లాగటం మొదలు పెట్టింది. ఎంత అదలించినా పోయిందికాదు. అది లాంగ్ బెల్ అనుకుని చాలామంది బడికి వెళ్ళటం మానేశారు. అక్కడున్న వాళ్ళని సంఘంవాళ్ళు లోపలికి వెళ్ళకుండా అడ్డు పెడ్తున్నారు. గలాటా జరిగేలాగుంది. నాకెందుకని నేనూ యింటికి పోతున్నా.

గో పా :

యింతకీ బడి వుందాలేదా ?

రా మా :

ఆ యింకేం వుంటుంది. చాలామటుకు ఎవరిళ్లకు వాళ్ళు వెళ్ళిపోయారు.

శే ష :

మొత్తానికి కోతులు మంచి తమాషాయే చేసాయే.

రా మా :

ఆ - ఆ సంఘంవాళ్ళు పట్టపగ్గా ల్లేకుండా హడావిడి చేస్తున్నారు. వాళ్లకి రాములవారి బంటుఅయిన ఆంజనేయులువారే స్వయంగా వచ్చి యీ విధంగా సహాయం చేశారని గొప్పగా చెప్పుకుంటున్నారు. (దూరాన్నుంచి) జనరాజ్య సంఘానికి జై. హెడ్మాష్టారు నశించాలి. స్కూలు ఆవరణలో సంఘం వీరవిహారం చేస్తుంది. జనరాజ్యసంఘంవర్ధిల్లాలి (అని కేకలు వినిపిస్తున్నాయి.)

రా మా :

అదిగో సంఘంవాళ్ళు కూడా వస్తున్నారు. యిక ఈ వాల్టికి బడి లేనట్టే.

(మళ్ళీ వెనకటి కేకలు వాట్నే అనుస్తూ బడిగంటలూ వినిపిస్తు న్నాయి. కేకలు ఆగిపోతాయి. ఇద్దరూ తెల్లబోతారు.)

శే ష :

అదిగో బెల్లు బడివుంది. పదండి పోదాం (అని పుస్తకాలు పుచ్చుకు బైల్దేరతాడు.)

గో పా ;

ఎందుకురా అనవసరంగాను ఈ సంఘంవాళ్లు మనల్ని ఏలాగూ వెళ్ళనివ్వరు. అక్కడ ఏం గొడవలు జరుగుతాయో! మధ్య మనం దెబ్బతినాలి.

(బడిగంటలు ఆగిపోతాయి)

శే ష :

రండి దెబ్బలూ తగలవు ఏమీ తగలవు.

(ఆ రోడ్డునుంచి లారీ వెళ్ళిన శబ్దం అంతా అటు చూస్తారు.)

గో పా :

అదేమిటి రిజర్వు పోలీసులారీ వెళ్తోంది.

(బడిగంటలు మళ్ళీ వినిపిస్తాయి )

పెద్దగా గొడవ, కేకలు "అరెరే హెడ్మాష్టార్ని కొట్టేసారు." అన్న కేకలు దూరాన్నుంచి వినిపిస్తాయి.

శే ష :

ఆ - హెడ్మాష్టార్ని కొట్టారా? అరెరె పాపం.

గో పా :

ఊ - యిక పుస్తకాలు లోపల పడెయ్యి. ఈవాల్టికి బడి లేనట్టే.

(దూరాన్నుంచి తుపాకీ దెబ్బలు వినిపిస్తాయి.)

రా మ :

అమ్మయ్యో తుపాకీలు కాలుస్తున్నారు.

శే ష :

పదండి మనంకూడా వెళ్దాం.

గో పా :

ఎందుకు ? మనంకూడా ఆ కోట్లాటలోపడి చావటానికా?

శే ష :

అసలుసంగతేమిటో చూచైనా వద్దాం.

గో పా :

మనం చూడకపోతే మునుచుకుపోయింది ఏమీలేదులే.

(పట్టుకోండి పట్టుకోండి అంటూ కేకలు)

(రఘునాథ్ పరుగెత్తుకుంటూ వస్తాడు. వీళ్ళుముగ్గుర్నీ చూచి వీళ్ళింట్లో జొరబడ్తాడు.)

ర ఘు :

రక్షించండి. పోలీసులు తరుముకు వస్తున్నారు.

గో పా :

ఏంచేసావు నువ్వు ?

ర ఘు :

తర్వాత చెప్తా ముందు నన్ను యింట్లో దాచండి.

శే ష :

నీకేంభయం లేదులేరా (లోపలికి తీసుకువెళ్ళి దాచివస్తాడు.)

రా మా :

వాడెవడో తెలుసా ?

శే ష :

అదే ఆ సంఘంవాడు కాదూ ?

రా మా :

అంతేకాదు మొన్న మన నాటకంరోజు అందులో గోల చేయించి రాళ్ళు రువ్వింది వీడే.

శే ష :

అవును నాకు తెలుసు. అంతేకాదు నన్ను ఎక్కడ చూచినా నామీద పళ్లు కొరుకుతాడు.

గో పా :

నువ్వదేదో మరో సంఘానికి సెక్రటరీవని నీ మీద గుర్రు.

శే ష :

అంతేకాదులే. చాలా కారణా లున్నాయి. అయినా వాడిప్పుడు కష్టంలో వున్నాడు వాడ్ని కాపాడాలి
(పోలీసులు ప్రవేశించి)
ఇటేపెవరైనా కుర్రాడు పరుగెత్తుకుంటూ వచ్చాడా ?

శే ష :

లేదండీ.

పో లీ :

లేదూ - అబద్ధం ఆడుతున్నావు. మాముందేగా ఈ రోడ్డు మీద పరుగెత్తుకు వచ్చాడు. మీ మొహాలు చూస్తే

వాడ్ని యింట్లో దాచినట్టున్నారు. వాడెవరో తెలుసా ? హెడ్మాస్టార్ని కొట్టాడు. ఆయన చావు బతుకులమీద వున్నాడు. వాడ్ని అరెస్టు చెయ్యాలి.

శే ష :

ఆ - హెడ్మాస్టార్ని కొట్టాడా ?

పో లీ :

ఊఁ - చెప్పండి వాడ్ని ఎక్కడదాచారో.

శే ష :

వాడిక్కడకి రాలేదండి.

పో లీ :

యిల్లు సోదాచేస్తాం.

మరో పోలీసు :

ఆ, ఆ - ఆగు యిదెవరింట్లో తెలుసా మేస్త్రీటుగార్ది. అదుగో మేస్త్రీటుగారే వస్తున్నారు.

(రాజారావు ప్రవేశం.)

రా జా :

ఏమిటయ్యా హడావుడి ?

పో లీ :

(శాల్యూటు చేసి) ఏంలేదు సాబ్. హైస్కూలు దగ్గర స్ట్రైకు జరుగుతోంది. అందులో ఓ కుర్రాడు హెడ్మా

ష్టార్ని కొట్టి యీ ద్రోవన పారిపోయి వచ్చాడు. అతడు యీ యింట్లో జొరబడ్డట్టు అనుమానంగా వుంది.

రా జా :

ఊఁ అయితే ఆలోచిస్తారేం వెతుక్కోండి. ఏరా శేషూ మీరంతా యిక్కడే వున్నట్టున్నారే, మీకు కనిపించకుండానే వాడీయింట్లో దూరి దాక్కున్నాడా ?

శే షు :

లేదండి నాన్నగారూ - మరే మేమేం

రా జా :

ఊఁ మీరేమాటారా ఏమిటలా నీళ్ళు నముల్తావు ? చెప్పేదేదో పూర్తిగా చెప్పు.

శే షు :

మేం యీయింట్లో ఎవర్నీ దాచలేదండీ.

రా జా :

అదేమిటయ్యా వీళ్ళిక్కడే వున్నారుగా. వీళ్ళకి తెలీకండా వాడీ యింట్లో ఎలా దాగుంటాడు.

పో లీ :

అదేనండి పొరపాటు. బహుశా అబ్బాయిగారు

రా జా :

అబ్బాయిగారే నంటావాయేం హెడ్మాష్టార్ని కొట్టింది.

పో లీ :

కాదండీ సార్, అబ్బాయిగారు తన స్నేహితుడు కదా అని దాచుంటారు సార్.

రా జా :

ఆ - ఏమన్నావ్ ?

పో లీ :

ఏమీలేదండి సార్ సెలవు !

రా జా :

ఆ - అదేమిటయ్యా నేరస్థుడ్ని పట్టుకోకుండానే, వెళ్ళి పోతారేం.

పో లీ :

యిక్కడ లేడంటున్నారుగా సార్.

రా జా :

ఎవరయ్యా అలాఅన్నది. అన్నీ మీరే అనుకుంటు న్నారు. అడుగో వాడే నేరస్థుడు వాడ్ని పట్టుకుపొండి. (శేషగిరిని చూపుతాడు.)

పో లీ :

కాదు సార్ అతడ్ని మేంచూశాం. ఈసందు మొదటి దాకా అతణ్ణి వెంబడించాం. వెయ్యిమందిలోనైనా వాడ్ని గుర్తుపట్టగలం అబ్బాయిగారు కాదు. అబ్బే వీరెక్కడ వాడెక్కడ ?

రా జా :

ఏడ్చినట్టుగానే వుంది మీ తెలివి. వీడు హెడ్మాష్టార్ని కొట్టాడని నేనుమాత్రం అంటున్నానా? వీడు నేరస్థుడ్ని దాచిన నేరస్థుడు. ఊఁ పట్టుకుపొండి.

శే ష :

నాన్నగారు నేను దాచలేదండీ.

రా జా :

అబద్ధాలుకూడా నేర్చుకున్నా వన్నమాట. ఒరేయ్ నీలాంటి సన్నాసుల్ని చాలామందిని చూశా. వాళ్లోమూల ఈసందు మొదటిదాకా వాడ్ని తరుముకొచ్చినట్టు చెబుతున్నారు - అయితే అబ్బాయిలూ మీకీ యింట్లో ఎప్పట్నించీ వున్నారు?

గో పా :

చాలాసేపట్నించీ వున్నాం అండి.

రా జా :

ఊఁ - యింకేం దొంగలు దొరికిపోయారు. ఈ వీధి మొదట్లో ప్రవేసించినవాడు మీరు చూడకుండానే మటుమాయం అయిపోలేదా ఏమిటో ఏయ్ 441 వీడ్ని లాక్కుపో అప్పుడుగాని నిజం బైటపడదు.

పోలీ :

అబ్బాయిగా రెండుకు సార్. అనుమతిస్తేయింట్లో వున్న అసలువాడ్నే పట్టుకుపోతాం. లోపల్నించి "దొంగ దొంగ" అనీ తక్షణం లోపల్నించి "అమ్మో" అని కేక పరుగులెత్తిన అడుగుల చప్పుడు.

(అంతా లోపలికి చూస్తారు ఆశ్చర్యంగా)



రాజా :

ఎవరది లక్ష్మి లక్ష్మి (అని కంగారుగా లోపలికి పరుగెత్తుతాడు) శేషగిరి "అమ్మా అమ్మా" అని లోపలికి పరుగెత్తుతాడు.

(అంతా ఖంగారు పడ్తుంటారు.)

(కాస్సేపటికి రాజారావుగారు బైటికి వస్తారు. వెనకాలే శేషగిరి వెక్కి వెక్కి ఏడుస్తూ బైటికి వస్తాడు.)

పో లీ :

ఏమటి సాబ్! ఏం జరిగింది ?

రా జా :

ఏముందీ. మామూలే పాముకు పాలుపోస్తే కరవటం మాన్తుందా. (శేషగిరిని చూచి) ఏడవకు. ఏం మీ అమ్మను కొట్టేటప్పటికి నీకు బాధతెలిసిందేం ? పాపం హెడ్మాష్టార్ని కొట్టినవాడిని దాచినప్పుడు లేదూ యీబాధ ? పాపం గంగిగోవులాంటివాడు. ఆయన్ని కొట్టడానికి వీడికి చేతు లెలావచ్చాయో ?

రా మ :

సంఘ ప్రభావం.

రా జా :

(తెల్లబోయి) అదేమిటబ్బాయి ? సంఘప్రభావం అంటున్నావు ?

రా మా :

ఆ! వాడు జనరాజ్య సంఘం మెంబరులెండి. వాళ్ళ దుర్బోధలలాంటివి. వాళ్ళకి వ్యతిరేకంగా వున్నవాళ్ళని కొట్టడమేన వాళ్ళకి సంఘంలో నేర్పేది.

రా జా :

ఏడిశారు వెధవలు. వీళ్ళని దేవుడు కొట్టడూ గురువుల్నీ ఆడవాళ్ళనీ కొట్టమని చెప్పే దదేం సంఘమోయ్. ఈ

పిల్లలందరికీ యీ బోధలు చేస్తుంటే చూస్తూ ఎలా వూరుకుంటున్నారంట యీ పెద్దమొద్దులు.

రా మా ;

అందుకేనండీ అసలు వచ్చిన తగాదా. హెడ్మాష్టారు ఈ సంఘసభ్యుల్ని స్కూలు కాంపౌండులో విన్యాసాలు జరుపుకోడానికివల్లలేదన్నారు. అంచేత వీళ్ళంతా యీవాళ స్ట్రైకు చేస్తున్నారు.

రా జా :

అదా - అయితే నువ్వుకూడా ఆ సంఘమెంబరువేనా ఏంరా ?

శే ష :

కాదండీ.

రా జా :

అబద్ధాలు లేకపోతే వాణ్ని నువ్వెందుకు దాచావు మనింట్లో.

రా మా :

అదికాదండీ. అసలు వాళ్ళసంఘానికి మాకూ చాలా విరోధమండీ. పచ్చగడ్డివేస్తే భగ్గుమంటుంది.

రా జా ;

ఊఁ- చూడగా మీరంతా తోడుదొంగలల్లే వున్నారే! నన్నే మాయచెయ్యటానికి ప్రయత్నిస్తున్నావా అబ్బాయ్? నే నెవరో తెలుసా?

రా మా :

ఆ తెలుసండీ. మేష్ట్రిటుగారు.

ఊఁ. అవుననుకో అంతమాత్రంచేత అబద్ధపు సాక్ష్యాలతో ఎప్పుడుపడితే అప్పుడు మోసం చెయ్యొచ్చనా నీ వుద్దేశ్యం.

రా మా :

రామరామ; అదికాదండీ, నేను నిజమే చెబుతున్నానండీ ఏరా గోపాలం?

గో పా :

అవునండి. మన శేషగిరి ఆ సంఘంచాయలకి పోడండీ ఓమాటు మేంఅంతా ఒకనాటకం వేస్తుంటే వీళ్లంతా గోల చేసారండి. శేషగిరిమీద రాళ్ళుకూడా రువ్వారండి.

రా జా :

ఊఁ. తమాషాగానే వుందే. అయితే మరి వాడ్నెందుకు వీడీవాళయింట్లో దాచాడు?

గో పా :

రామారావు వద్దనిచెబ్తుతూనే వున్నాడండీ. ఆపదలో వున్నప్పుడు శత్రువైనాసరే శరణంటే రక్షించాలని శేషగిరి అతడ్ని దాచాడండీ.

రా జా :

(పెద్దగా నవ్వి) ఆరోజులు పోయాయోయ్. ఆవన్నీ ఏవరో పుస్తకాల్లో పనిలేక రాసిపారేసిన రోజులు. చూడుమరి. ఆ వెధవ ఎంతపని చేసాడో! వీడెవడో దొంగఅని అరచిన మా ఆవిడని ఒక్కపెట్టుపెట్టి పారిపోయాడు. దెబ్బ బలంగా తగల్లేదుగాని ఆయువు పట్టున కొట్టాడు. ఇంతకీ దేముడంటూ వోడుండబట్టి ఆమె బ్రతికింది, అన్నట్టు హెడ్మాష్టారు బ్రతికే వున్నారా?

పో లీ :

ఆ- ఆ- ఆస్పత్రికి చేర్చాం సార్. పాపం వయస్సు మళ్ళినందున దెబ్బకే స్పృహతప్పి పడిపోయారు.

రా జా :

(నవ్వి) పిచ్చివాళ్ళు. వయసు మళ్ళినందున కాదు స్పృహతప్పింది. వాడు కొట్టాలనే కొట్టాడు ఆయువు పట్టులో- సంఘం- ఆ సంఘంలో యిలా కొట్టడం కూడా నేర్పుతారేమిట్రా ?

రా మూ :

ఆ—

రా జా :

ఆ! (ఆశ్చర్యంగా)

రా మూ :

ఏమోనండి మరి.

రా జా :

ఏమిటయ్యా దీపస్తంభాల్లా అలా నుంచున్నారు. ఊఁ పోండి వాణ్ని పట్టుకురండి.

పో లీ :

(బిత్తరపోయి) చిత్తం. (అనుకుంటూ శాల్యూట్ చేసిపోతారు.)

రా జా :

ఆగండి ఎక్కడికి?

పో లీ :

వాడ్ని పట్టుకుంటానికండీ.

రా జా :

ఏడిశాడు. ఆ కుర్రవెధవ నెందుకు. వాడితండ్రి తండ్రి లేకపోతే వాడ్ని పోషించే మరెవర్నైనాసరే పట్టుకు రండి. ఓ వందరూపాయలు వాడి పోషకుడికి అంటిస్తే సరీ వీడి ఆటలు కట్టాయి. ఈ కుర్రసన్నాసిని ఏంచేసి మటుకు ఏం ప్రయోజనం.

పో లీ :

చిత్తం (పోబోతారు.)

రా జా :

ఆ. మరోమాటు స్ట్రైకు అయిపోయినట్టేగదూ.

పో లీ :

ఆ- గాల్లోకి తుపాకులు కాల్చి యిందాకానే చెదర గొట్టాం మూకనంతా,

రా జా :

మీకదో దుర్బుద్ధి. తుపాకు లున్నాయికదా అని గాల్లోకి కాలుస్తాం అంటారు మహాగొప్పగా. మీ గురి మండి నట్టే వుంటుంది. గాల్లోకి తుపాకీ ఎత్తేలోగా అదికాస్తా ఎవడిమీదో వోడిమీది పేలటం, అక్కడ్నించీ సాను భూతులూ, సభలూ, యింక్వైరీలూను. యింతకన్నా సులువైనమార్గం తెలీదుటయ్యా మీకు గుంపు చెదర గొట్టడానికి.

పో లీ :

తెలీకేంసార్. హద్దుమీరి, చెయిదాటి-

రా జా :

చాల్చాల్లే- నేనేం యింక్వైయిరీ ఆఫీసర్నుకాను. మీరు ఏ పరిస్థితుల్లో గాలిలో తుపాకులు పేల్చారో విచారించ

డానికి. ఆ- నే చెప్పవచ్చిం దేమిటంటే- అదే వాడి తండ్రిని పట్టి తీసుకురండి. చూడండి. యింకా స్ట్రైకు అణగదని మీకు అపనమ్మకంగా వుంటే ఆ రింగు పీడర్ల తాలూకు పోషకులమీద కేసులు పెట్టండయ్యా.

పో లీ :

ప్రజారాజ్యంకదా సార్- మామీద అసలే-

రా జా :

ఏడ్చినట్టేవుంది. ప్రజారాజ్యం అంటే బడిపంతుళ్ళని ప్రాణాలు పోయేలా కొట్టనివ్వటమటయ్యా.

(బడిగంటలు మ్రోగుతాయ్.)

రా జా :

అదుగో స్కూలు యథావిధిగా జరుగుతుంది. యీవాళ కూడా- ఊః పొండి. వీర్రాజు హెడ్మాష్టారంటేమాటలా యిలాంటి ఆవతాయిగాళ్ళని ఎంతమందిని చూశాడో. యింకా ఎంతమందిని చూడబోతాడో.

(బడిగంటలు ఆగకుండా వినిపిస్తుంది.)

రా మా :

ఆ- అదేమిటి. లాంగ్ బెల్.

శే ష :

అదిగో శేఖరం వస్తున్నాడు. శేఖర్ శేఖర్ ఎందుకురా ఏడుస్తున్నావు?

(శేఖర్ లోనికి ప్రవేశిస్తూ వెక్కి వెక్కి ఏడుస్తూ)
హెడ్మాష్టారు——చచ్చిపోయారు.
అంతా ఒక్కమారు 'ఆ' అంటారు.
రాజారావు, శేషగిరి "లక్ష్మి" "అమ్మా" అంటూ లోప
లికి పరుగెత్తుతారు.
(గుడిగంటలు వినిపిస్తూనేవుంటాయి విచారంగా)

( తెర )



# గుడిత లుపులు

పిల్లల ఏకాంక నాటిక

( ఒ కే రం గం )

## పా త్ర లు

1. మోహన్ } ఐదవ తరగతి విద్యార్థులు.
2. రామం }
3. హెడ్ కానిస్టేబిల్
4. ఇద్దరు పోలీసులు
5. తెరలో కొన్ని గ్రామస్థుల గొంతులు.
6. ఈనిన పంది
7. దాని పిల్లలు.

( తె ర లో )

ప్ర యో త్న :

రామం, మోహన్ అ వూళ్లో ఐదోక్లాసు చదువుతున్నారు. ఇద్దరికి క్లాసులో అంత బాగా మార్కులు రావటంలేదు. ఓకరోజు రామానికి వాళ్ళబామ్మ కాళిదాసు కథ చెప్పింది. కాళిదాసు మొదట్లో చాలా మూఢుడనీ, అతని భార్య ప్రోద్బలంవల్ల కాళికాదేవి గుడిలో ప్రవేశించి, ఆ దేవి లోకసంచారం చేసి వచ్చేటప్పటికి గుడిలోపల తలుపులు వేసుకుకూచ్చుని ఆమెను 'విద్య ఆర్జించా'డనీ, ఆమె అతని నాలికమీద బీజాక్షరాలు వ్రాసిందనీ, అతడు అప్పట్నించీ మహాకవి అయినాడనీ. ఆవూరికూ్కడా ఓ పాడుబడ్డ కాళికాలయం వుంది వూరుబైట. రామం తన స్నేహితుడైన మోహన్‌కి చదువు వచ్చే ఈ తేలిక వుపాయం చెప్పాడు. ఊరుబైట గుడివద్దకు వచ్చారు యిద్దరూను, కాళికాదేవిని ప్రార్థించి విద్యావంతుల మౌదామని.

స్టే జి

( ఇక చూడండి తమాషా )

రే డి యో

( ఇక వినండి తమాషా )

తెరనెత్తగా సంధ్యచీకట్లు అలుముకునే వేళ.

రా మ ం :

మోహన్ ఊరుబైట పాడుబడ్డ గుడివద్ద నుంచుని వుంటారు.

మో హ :

నాకు భయంగా వుందిరా !

రా మ ం :

భయమెందుకురా ?! దేవతంటే మన కన్నతల్లి లాంటిది. మరేం మింగెయ్యదులే!!

మో హ :

ఒకవేళ మింగేస్తే-?

రా మ ం :

మింగిస్తే మరేం ఫరవాలేదులే. ఇద్దర్నీ ఒక్కసారి మింగెయ్యలేదుగా. ముందు నిన్ను మింగుతే నేను ప్రార్థన చేస్తాను. లేక నన్ను మింగుతే నువ్వు ప్రార్థన చెయ్యి. అప్పుడా మింగినవాణ్ని కక్కేస్తుంది.

మో హ :

ఎందుకొచ్చిందిరా ఆసలీ మింగించుకోటం! కక్కించుకోటం!! హాయిగా యింటికిపోయి బుద్ధిగా చదువుకుంటే చక్కగా ప్యాసు అవుతాం.

రా మ ం :

ఒట్టిమాట. నాకసలు పుస్తకాలు చూస్తే తేళ్లూ,

జె(రెలూ పాకినట్టుగా వుంది. మన మిప్పుడు చదివి ప్యాసవటం కల్ల.

మో హ :

రంగడు చాలా తెలివిగలవాడు. వాళ్లింటికిపోయి వాణ్ణి బతిమాలుకుని పాఠాలన్నీ చక్కగా చెప్పించుకు చదువుకుందాం.

రా మం :

ఛ. ఛ. వాణ్ని బ్రతిమాలటమేమిటిరా. మనమేం వాడి కన్నా తెలివితక్కువ వాళ్ళమనా నీవుద్దేశ్యం. నీకేం భయంలేదు. రా. చీకటిపడింది దేవత సంచారానికి బైల్దేరివుంటుంది. మనం గుళ్లో ప్రవేశించి తలుపులు బిడాయించు కూర్చుందాం.



మో హ :

సరేపద. నీతో వచ్చాక నువ్వు చెప్పినట్లు వినటమే మంచిది. నిన్ను వదలి యీ చీకట్లో ఎక్కడికి పోతాను?

(ఇద్దరూ గుడిలో ప్రవేశించి తలుపు లేసుకుంటారు.)

మో హ :

ఒరేయ్ రామం. చూడు అమ్మవారి విగ్రహం కదుల్తు న్నట్టుంది.

రా మ ం :

ఏడిశావులే విగ్రహం కదల్టమేమిటి? ఏమీలేదు నోరు మూసుక్కూచో.

మో హ :

అది కాదురా అమ్మవారింకా గ్రామసంచారానికి బైల్దేర లేదేమో అని నా అనుమానం.

రా మ ం :

నీ అనుమానాల కేంలే. చీకటిపడితే ఈ గుళ్లో క్షణం వుండదు అమ్మవారు. సంచారానికి బైల్దేరి తీరాల్సిందే. మాబామ్మ యీ విషయం సందేహించాల్సిన పని లేకుండా చెప్పింది.

మో హ :

అరెరె. విగ్రహం పడిపోతోందిరోయ్ (ఖంగారుగా)

రా మం

(తెల్లబోయి) అవునురా. అమ్మవారు యింకా గుడి కద ల్లేదుకాబోలు. ఏంచేద్దాం. కళ్లుమూసుకో ప్రార్దన చెయ్యి. (అని చేతులుజోడించి ప్రార్థన ప్రారంభిస్తాడు. మోహన్ అనుకరిస్తాడు.)

మో హ :

దేవీ మే పసివాళ్ళం. మాకు చదువు రావడంలేదు.

రా మం :

ఛ. అదేంభాషరా. ఆభాష మనుషులు మాట్లాడుకునేది దేవతలు మాట్లాడుకునే భాషలో ప్రార్థన చెయ్యాలి.

మో హ :

అది నాకురాదే.

రా మం :

రాకపోవటమేమిటి (రహస్యంగా) నీకూ నాకూ అర్థం కాందే దేవభాష. నోటికొచ్చినట్టు వాగెయ్యి. మధ్య మధ్య ఓం హ్రీం హ్రైం నమోస్తూ అంటూండు. వూనే నన్నట్టు అను నీకెందుకు. ఓం హ్రీం-

(బైటనుంచి తలుపులు తోస్తున్న శబ్దం. భూనభోంతరాళాలు బద్దలయేలా "ఘీం" కారం)

మో హ :

అమ్మవారు తలుపులు తడ్తోందిరోయ్.

రా మం :

అమ్మవారు గుళ్లోనే వుందనుకున్నాంగా

మో హ :

ఏమోపురి. అంతా మనం అనుకోటమేగా! అసలు సంగతేమిటో ఎవరికి తెల్సు? (బైటశబ్దం ఎక్కువౌతుంది)

రా మం :

ఒకవేళ అయ్యవారు వచ్చి తలుపు తడ్తున్నారేమోరా?

మో హ :

అదేమిటి

రా మం :

అదంతేలే. యీవాళ మనపని ఆఖరు.

మో హ :

ఆ- అదేమిటిరోయ్.

రా మం :

అదా- ఆట్టే ఆలోచించగా నాకెంతోస్తోందంటే ఈ అమ్మవారు ఒక్కత్తేగాక మరో అయ్యవారితో కలసి గ్రామసంచారం బైల్దేర్తుందనీ. ఆ అయ్యవారు వచ్చి తలుపు తడ్తున్నారనీ ఆ శబ్దానికి అమ్మవారు కదుల్తోందనీ.

మో హ ;

అయితే పోయి తలుపులు తియ్యరాదూ యిలా కదుల్తూ కూచోకపోతే.

రా మ ం ;

అమ్మవారు తలుపులు తియ్యలేదు లేవోయ్.

మో హ :

ఊ??!?- ఒరేయ్ తలుపులు తియ్యటం చేతకాని అమ్మవారు మనకి చదువొచ్చేట్టు ఏం చెయ్యగలదురా?

రా మ ం :

నోరుముయ్యి. గుడ్లు పెటుక్కున పీకెయ్యగలదు. నీకీ సంగతులు తెలియవులే. యింకా కావాలిస్తే మాబామ్మ నడుగు.

మో హ ం :

మరి మీబామ్మ అమ్మవారు అయ్యవారు కలసి గ్రామ సంచారానికి బైల్దేర్తారని చెప్పలే.

రా మ ం ;

లేదురా. అందుకే మనం దగాపడిపోయాం. ఈ ముసిలాళ్ళున్నారే కొన్నిచెబుతారు కొన్ని చెప్పరు. మనం మధ్యన చిక్కునపడ్తాం. పద్మవ్యూహంలోని అభిమన్యుడు లాగున

మో హ :

అసలు సంగతులు చెప్పటానికి మీబామ్మకీ సిగ్గేసి వుంటుందిలేరా.

రా మ ం :

సిగ్గా?! సిగ్గెందుకురోయ్.

మో హ :

అదే. మా అక్కా బావా అర్థరాత్రిదాకా అలా షికార్లు చెయ్యటం విడ్డూరంగా వుందని నీతో చెప్పిందని చెప్పావుగా. దేవుడూ దేవతా కలసి గ్రామ సంచారం పోతారంటే, నువ్వు వెంటనే దేవుళ్లే పెళ్ళాలతో షికార్లు కొట్టంగాలేంది మనుషులుమాత్రం షికార్లు తిరగ్గోడదా అని పుసిక్కున అడిగేస్తావని ధడిసి ఆ సంగతి చెప్పి వుండదు.

బైటనుంచి పెద్ద గాండ్రింపు.

తలుపులు తోసిన శబ్దం.

గుళ్లో విగ్రహం పడిపోతుంది. ఇద్దరూ "అమ్మ బాబోయ్" అంటారు. విగ్రహం వెనకాల పందిపిల్లలు ఒకదాన్నొకటి తోసుకుంటుంటాయ్.)

రా మ ం :

అరెరె. పందిపిల్లలురా. ఎంత ముద్దొస్తున్నాయో చూడు.

మో హ :

యింకానయం. ముద్దెట్టుకున్నావు కావు. ఛీ. ఛీ. దేవ తని మైల పడేశాయి.

రా మం :

ఎంచక్కా వున్నాయో చూడు.

మో హ :

చిన్నప్పుడన్నీ చక్కగానే వుంటాయి. పెద్దయినాక చూడు వాటి అందం. బురదంతా పట్టించుకుని ఓక్కా
(అని డోకుతాడు తల్చుకుంటూ)
(బైటనుంచి తలుపులు గట్టిగా తోస్తూ తల్లిపంది ఘీంకారం.)

రా మం :

అరేయ్ అది తల్లిపందిరా. దేవతాకాదు. దయ్యమూ కాదు.

మో హ :

చచ్చాం ఫో. యివాళ్తో పనపని ఆఖరు.

రా మం :

ఏమిటిదారి. ఆ తల్లిపంది గుళ్లో ప్రవేసిస్తే మనల్ని చీరేస్తుందే.

మో హ :

వ్యవహారం చూడగా గుడితలుపులు యింక ఆట్టేసేపు ఆగేట్టులేవు. వాట్ని ఏక్షణానైనా తోసుకు ఆ తల్లి పంది లోపలె జొరబడవచ్చు.

రా మ :

అయితే ఏంచేద్దాం?_ ఆ. అద్గదీ. ఆ విగ్రహాన్ని మోసుకొచ్చి తలుపులకు అడ్డంగా పెడ్దాం.

మో హ :

అమ్మ బాబోయ్. అంత పెద్దవిగ్రాహాన్ని మనం మొయ్యగలమా ?

రా మ ం :

ఏం. ఎందుకు మొయ్యలేం. పందిపిల్లలన్నీ కలసి దాన్ని పడెయ్యగాలేంది మనిద్దరం కలసి దాన్ని అక్కడ్నించి యిక్కడికి తెలేమా?

మో హ :

సరేపద. (విగ్రహాన్ని మోయబోతారు, అది కదలదు) ఎందు కొచ్చింది చెప్పు ఈశ్రమ. హాయిగా యింట్లో కూచుని చదువుకుంటే బాగుండేదికాదూ. ఉహూనేను దీన్ని మొయ్యలేను.

రా మ ం :

ఆ. ఆ. చూడు. అరె నగలు, డబ్బు. విగ్రహం పడి పోయినచోట నగలున్నాయిరా.

మో హ :

అరె. హాశ్చర్యంగా వుందే.

(బైటనుంచి తలుపులు తోసినశబ్దం. తలుపులు తెరుచుకునే ట్టుంటాయి.)

రా మ ం :

మోహన్, యిక లాభంలేదు. తల్లిపంది తలుపులు తోసుకువచ్చేస్తుంది. మనం యిక్కడినుంచి బ్రతికి బైటపడటానికి ఒకేఒక వుపాయం తోస్తోంది.

మో హ ;

అదేమిటో దబ్బున చెప్పు.

రా మ ం ;

మనిద్దరం తలుపు పక్కగా చెరోమూలా నక్కుదాం. పంది లోపలకురాగానే మనం బైటకు పారిపోదాం.

(అలా యిద్దరూ చెరోమూలా నక్కుతారు. బైటనుంచి పంది లోపలకు వస్తుంది తలుపులు తోసుకుని, ఇద్దరూ పారిపోతారు.)

(పంది ఘీంకారంచేస్తూ అటూయిటూ తిరిగి పిల్లలదగ్గరకు వెళ్ళి పాలిస్తుంది.)

(బైటనుంచి)

రా మ ం :

చూడు. దూరాన్నించి ఎవరోవస్తున్న అలికిడి వినపడ్తోంది.

మో హ :

అవునురోయ్. నాకేమిటో భయంగా వుందిరా.

రా మ ం :

ఛా నోర్ముయ్. మాట్లాడ్తే భయం భయం అంటావ్. యీవాళ అమ్మవారిచేత బీజాక్షరాలు వ్రాయించుకుని మరీ వెళ్ళాలి ఇక్కడ్నించీ.

అదిగో. ఎవరో దగ్గరికి వచ్చేస్తున్నారు. ఒకవేళ అమ్మవారేనేమో.

రా మ ం :

మాట్లాడకుండా ఆ అరుగుల క్రింద దాక్కుందాం పద.

కాస్సేపు నిశ్శబ్దం.

(ఇక రెండు కొత్తగొంతులు వినిపిస్తాయి బైటనుంచి)

ఒ క టి :

ఈ గుళ్లోనేనా దాచావు?

రెం డ వ :

అవును. విగ్రహంకింద దాచాను.

ఒ క టి :

అరె. గుడి వూరికి చాలా దగ్గర్లోవుందే. ఎవరన్నా కనుక్కుంటే ఏమయేది?

రెం డ వ :

ఈ గుళ్లోకి మానవమాత్రు డెవడూరాడు. ఇందులో అమ్మవారు పగలే మనుషుల్ని విరుచుకుతింటుందని వూళ్ళో పుకారు.

ఒ క టి :

(లోపలికి చూచి) ఏది గుళ్లో విగ్రహం కనపడదేం?

రెం డ వ :

ఆ- పద చూద్దాం.

(ఇద్దరూ లోపలికి ప్రవేశిస్తారు.)

(బైట గుసగుసలు)

రా మం :

ఎవరురా వాళ్లు మన వూరివాళ్ళుకాదే.

మో హ :

కాదుగాని అందులో ఒకణ్ని నేనెరుగుదును. రెండు మూడు నెలలక్రితం మన వూళ్ళో అందరికీ వీభూతి పంచిపెట్టిన బైరాగి.

రా మం :

అవున్రోయ్ నాకూతెలుసు. వీళ్ళవాలకం చూస్తే యిక్కడున్న నగలు వీళ్లే దాచినట్లున్నారు.

మో హ :

సరే తలుపులు గొళ్లెంపెడ్దాం. నువ్విక్కడ వుండు వూళ్ళోకి వెళ్ళి నలుగుర్ని పోగుచేసుకు వస్తా.

రా మం :

అమ్మయ్యో నాకు భయం. నేనుకూడా వస్తా.

మో హ :

అయితే నువ్వు వూళ్లోకివెళ్లు. నేను వీళ్ళని కాపాలా కాస్తా.

(తలుపులు బైట గొళ్ళెంపెట్టిన ధ్వని.)
(ఆ గంతుకు లిద్దరికీ ఆధ్వని వినపడదు)

రెండవ :

నగలన్నీ వున్నాయిగాని విగ్రహాన్ని ఎవరు పట్టగొట్టారో

ఒ క టి :

సరే ఆ నగలన్నీ మూటకట్టు దబ్బున, బైటపడ్దాం యీవూరునుంచి. ఎవరో మన రహస్యం కనిపెట్టారు. ఇక ఇక్కడ ఆట్టేసేపు వుండగూడదు.

రెం డ వ :

వాడు నగలు మూటకడ్తూండగా పంది ఘీంకారంచేస్తూ వీరిద్దరిమీదా పడ్తుంది.

ఇద్దరూ "బాబోయ్" అంటూ పారిపోడానికి ప్రయత్నిస్తారు. కానీ తలుపులు వేసివుంటాయ్. పంది వీర్ని గాయపరుస్తుంది. తలువులుతెరవడానికి వ్యర్థప్రయత్నం చేస్తుంటారు.

ఒ క టి :

చచ్చాంరా బాబూ యీవాళ్టితో మనపని ఆఖరు. ఈ పంది మనల్ని బ్రతకనివ్వదు.

రెం డ వ :

యీ తలుపుల్ని పట్టుకు ఎగబ్రాకీ అదుగో ఆ కొక్కాన్ని పట్టుకువేళ్లాడదాం. (గుడికప్పుకేసి చూస్తూ అంటాడు)

ఒ క టి :

ఎంతసేపు వేళ్ళాడగలం. ఈ పంది యీవాళ మనల్ని వదలదు.తలుపులుతెరిచేవుపాయం ఏద్తైనా ఆలోచించు. (పంది బాధపడలేక ఆఖరుకు పైనుంచి వేళ్లాడ్తారు)

రెండవ :

అసలు తలుపులు ఎవరు మూసారో బైటనుంచి

(బైటనుంచి)

దయ్యం.

ఒకటి, రెండు :

బాబోయ్.

బైటనుంచి :

వూరు వూరంతా వస్తున్నట్టుందే.

ఒకటి :

ఎవర్రా బైటనుంచి మాట్లాడేది.

బైట :

అమ్మవారి మొగుణ్ని అయ్యావార్నిరా

రెండవ :

బాబోయ్.

ఒకటి :

ఏమిటా బాబోయ్. (రహస్యంగా) ఎవడో కుర్రవాడి గొంతులావుంది. నువ్వాగు నేచెప్తా.
అయ్యగారూ "ఎవరో వస్తున్నట్టుందే అంటున్నారే" ఎవరువారు?

బైట :

ఊళ్లోజనం, మా మోహన్‌గాణ్ణి పంపాగా వాళ్ళందర్నీ పిల్చుకురమ్మని.

రెండవ :

చచ్చాం. యీవాళ్టితో మనపని ఆఖరు.

ఒకటి :

ఈ తలుపులు తెరిచే వుపాయం ఏమీలేదు? వాళ్ళొచ్చే లోగా పారిపోవాలి మనం,

బైట :

అదుగో అంతావచ్చేసారు. ఇంకెక్కడికి పారిపోతారు.

(తలుపులు తెరచుకుంటాయ్)

కర్రలూ, లాంతర్లు పుచ్చుకు జనం నిలుచున్న అలికిడి పంది వారిమీదకు ఎగబడ్తుంది. బైటికి వెళ్ళటంతోనే ఘానఘోంతరాశాలు బ్రద్దలయేలా కీచుపెడ్తుంది. అంటే వుచ్చువేసి పెట్టేసారన్నమాట దాన్ని. లోపలికి యిద్దరు కానిస్టేబుల్స్ వచ్చి దొంగల్ని పట్టుకుంటారు. హెడ్డుకి రామం నగలు చూపుతాడు. హెడ్డు అన్నీ మూటగడ్తూంటాడు.

హెడ్డు :

శభాష్. అబ్బాయిలూ మీకు ప్రభుత్వంవారు పెద్ద బహుమతి యిచ్చేలా రిపోర్టు వ్రాస్తాను. ఇన్నాళ్ళ నుంచీ మాకు దొరక్కుండా అష్టకష్టాలూ పెడ్తున్న గజదొంగల్ని పట్టిచ్చారు.

(రామం మోహన్ ఒకరి మొహాలొకరు చూచుకుంటారు.)

( తెర )



నాటికలు నాటికలు నాటికల

చదవండి

నీతి కథానిధి

నాగులు

మామ కథలు

మ్యావ్ అన్న దెవరు

నాటికలు నాటికలు నాటిక

98

| Check List | | | |
|---|---|---|---|
| Book Number | AA/01A228 | Date | 22/09/2021 |
| Front Cover | yes | Back Cover | yes |
| Blank Pages | CI, 52, 97 | | |
| Missing Pages | NO | | |
| Prepared | Sandhya | Scanned | Mounika |
| BOOK SIZE | H 7.1 W 4.6 | Pages | 102 |

